నిగమార్థ చంద్రోదయ గ్రంథమాల. ౮ కిరణము.



# చిద్విలాస శతకము



గ్రంథకర్త:

రాప్తాడు సుబ్బదాసయోగి

# — శ్రీ హఠయోగాశ్రమ మందులు —

(మూలికలచే తయారు చేయబడినవి)

1. శ్వాసకాసకుఠారము.
   దివ్యమైన యోషధులచే చేయబడినది. వివిధక్షయలు ఎటువంటిశ్వాసకాసలైనను ఇచ్చాపథ్యముతో త్వరగా బాగగును. (40 దినముల మందుకు) రు. 25—0—0.

| | | | |
|---|---|---|---|
| 2. సిగ్రుపుష్ప రసాయనం. | 1 శేరు | రు. | 5—0—0. |
| 3. మహాకూష్మాండ లేహ్యం | ,, | రు. | 5—0—0. |
| 4. మదన కామేశ్వరి లేహ్యం | ,, | రు. | 5—0—0. |
| 5. లేహ్యాంమృతం | ,, | రు. | 4—0—0. |
| 6. ఔదుంబరారిష్ట (రక్తవృద్ధికి) | 1 ఔన్సు సీసా | | 3—0—0. |
| 7. సుఖభేదినూనె (ఇది పిన్నలకు పెద్దలకు ఉపయోగపడును) | 1 ఔన్సు సీసా | | 0—4—0. |

ఇతర వ్యాధులకును మావద్ద మందులను కోరిన వారుకును.

ఓమ్

నిగమార్థ చంద్రోదయ గ్రంథమాల. ౭ కిరణము.

# చిద్విలాస శతకము



కం॥ యోగాగ్ని దగ్ధకర్ములు
యోగీశ్వరు లేమహాత్ము నొండెఱుఁగక స
ద్యోగ విభావిత మనమున
బాగుగ వీక్షింతురట్టి, పరముభజింతుఁ౯.

భాగ॥ అష్టమ॥



40


గ్రంథకర్త:

సురభినాట్య కళాస్థాపనాచార్య, హరికథాప్రవీణ,

## రాప్తాడు సుబ్బదాసయోగి

ధర్మవరము


వెల 0-12-0

# కృతి సమర్పణము

---

కం॥ అమ్మా! నాదగు యమలకే
లమ్మా! నను పుత్రుని భాతి ననవరతము ప్రే
మమ్మున బెంచితి వీకృతి
సమ్మతి నంకిత మొనర్తు, చయ్యన గొనుమా

తే॥ గీ॥ సాటిలేరమ్మ నీమన-శ్శాంతి కెవరు
అతిథులను బ్రోచు కల్పక-మమ్మ నీవు
రాజరాజేశ్వరి భక్తి-రహి వెలుంగు
సుగుణచరితవుగా కావ్య-సుమము గొనుము

---

# ప్రాతఃకాల ప్రార్థన

తే॥ తనువు మరచియు నిద్రించు - తరుణమందు
కీడు నిసుమంత రానీక - పోడిమిగను
మమ్ము కాపాడు చుందువు - మరపులేక
గాన నతులను చేకొమ్ము - దీననాథ॥

తే॥ ఉదయమున మాదు కర్తవ్య - మూనిచేయ
నూతనోత్సాహముల నిచ్చు - దాత వీవు
తగిన బలమిమ్ము సంపూర్ణ - దయదలంచి
వందనము సేయువారము - పరమ పురుష.

తే॥ పనుల గావింప సుఖముల - ననుభవింప
భక్తియును శ్రద్ధయును నిమ్ము - భవ విదూర
చెడుతలంపుల బుట్టంగ - జేయనీకు
మయ్య, పరమేశ లోకేశ - నెయ్యమలర.

# సాయంతనమందు ప్రార్థన

తే॥గీ॥ కాయమును మానసంబును - గాచినావు
పుత్రి వాత్సల్యతను జూపి - బ్రోచినావు
సత్కృతులు సేయ నవకాశ - సాధనముల
గూర్చి వానిని మఱి నెఱ - వేర్చుటకును

తే॥ మాకు తగినంత బలమిచ్చి - మనిచినావు
వందన మొనర్చుచున్నాము - భక్తితోడ
హాయిగా నింక నిద్రబో - నాజ్ఞ నిమ్ము
సర్వలోకేశ పరమేశ - సత్ప్రకాశ॥

శ్రీ

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత
శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# పీఠిక

"కవిః క్రాంత దర్శీ" అన్నారు పెద్దలు. కనుక క్రాంత దర్శి కానివాఁడు కవిగాడు. కవి కర్మ కావ్యము ప్రపంచమున గల వస్తువుల కలరూపు చక్కఁగ నర్థముచేసికొని భావించు కొన గల్గినదే - కవిహృదయమును ప్రస్ఫుటీకరించగల ఆదర్శము కావ్యము. కావ్యమునందలి రచనల ననుసరించి కవి స్వరూప స్వభావముల నిదమిత్థముగా నిర్ణయించుకొన వచ్చును. ఇప్పటికి జాల శతాబ్దములక్రింద ప్రసిద్ధిఁజెంది యుండి కాలగర్భాంతరితులైన కవుల వంశాదులు వారియభి రుచులు ఆకాలపు జనుల సంస్కారముల ఇయత్తను నిర్ణయిం చుట కాధారములైన విట్టి కావ్యములేగదా! కాగా కవికి సర్వతోముఖముగా చిరస్థాయియగు కీర్తి ప్రతిబింబము నీగల పరమోత్తమ సాధనమగు కావ్యరచనకన్న పరమప్రయోజ నము మఱొక్కటేదీ!

ఇక ఉత్తమ పురుషాశ్రితమగు కావ్యము ప్రశస్త్య మందురు. కాగా పురుషోత్తమాశ్రితమగు కావ్య ముత్త మోత్తమ మనుటలో సందేహముండదు. ప్రకృతగ్రంథమట్టిది.

ఈశ్వర విభూతివిలాస శతకమను పేరు దీనికెంతయు తగియున్నది. భగవంతుఁడు గీతలో తన మహిమావిస్తారమును విభూతియోగములో సూత్రప్రాయముగ బ్రతిపాదించెను. ఏతద్గ్రంథకర్త శ్రీ రాష్ట్రాటి సుబ్బదాసుగారు భగవంతుని విభూతి విలాసములు నన్నింటినాలోకించి యర్థముఁజేసికొని ఆనందముతో నుప్పొంగిన డెందముతో నందముగ నభివర్ణించి యుండుటచే త్వరగ పండితుల హృదయముల లోఁగొనఁజాలియున్నది. హరికథాప్రవీణ బిరుదాంకితులు సురభి నాట్యమండలి స్థాపకులగు శ్రీసుబ్బదాసుగారు సహజముగ భావుకులు; పైగా జిజ్ఞాసా పరీక్ష వ్యాసంగులు. వీనికిఁదోడు ప్రపంచమున బలుపోకడలతోఁ బరిణతిఁజెందిన పరిశుద్ధసంస్కారము నంది విరాగియైనారు. నాటకముల వ్రాయుట ఆడుట వీరి మొదటి విలాసము. హరికథారచనా కాలక్షేపముచేయుట రెండవది. ఈ రెంటిచేత నేర్పడిన పరిణామమే వీరి వేదాంతవిజ్ఞానమునకు మూలకందము. వేదాంత విజ్ఞానమునకుఁదోడు ప్రవచనశక్తి, రచనాశక్తి చక్కగా నలవడినది. ఈ సమస్తానుభవ సమ్మేళన పాకమీ గ్రంథము.

ఈశ్వరుని లీలల నీచోటాచోటనక యీవేళ యావేళ యనక యీప్రాణి యాప్రాణి యనక సమస్త సృష్టిజాలము నందు కనుగొని గుర్తించి గానమొనరించినాడు. ప్రకృతి వైభవ వర్ణనముతో నుప్పొంగి ధనిక దరిద్ర తారతమ్యములచే నేర్పడు విషమపరిస్థితులకు క్రుంగి అజ్ఞానముచే నైహికాభిరుచులలో మునిగితేలు మూర్ఖుల మందలించి జంతుజాలములకు సృష్టికిఁగల పరస్పర ప్రేమబంధమున కచ్చెరువంది యభినందించుచు నందందు జాతీయతా దూరమైన నవ యువకుల

3. కోట్లకు గడియించుకొన్న నరుండైన
గోచినైనను వెంటగొనుచుపోడు

4. చెలువైనయట్టి నీసృష్టివిలాసంబు
చూడనికన్నులు పాడుదోవలు

వీనిని స్థాలీపులాక న్యాయముగ మాత్రమే యుదాహరించితిని. ప్రత్యక్షరముగూడ నీవిధముగనే భావబోధకమనుట స్వభావోక్తియే! ఇట్టికావ్యములే ప్రపంచమునందు చిరస్థాయితను గాంచి కర్తకు గైవల్యపదవిని సులభముగ నందింప గలవని నానమ్మిక. ఇట్టి ఉత్తమరచనలీ కవికలమునుండి పెక్కులు వెలువడి ప్రపంచ తారకములగుగాక యని యాసించుచున్నాను.

ఇట్టి పవిత్ర గ్రంథమునకు పీఠిక వ్రాయునవకాశమును నాకొసగినందులకు దాసకవిగారికి నేనెంతయు కృతజ్ఞుడను.

ఇట్లు

శిరోమణి విద్వాన్ కలచవీడు శ్రీనివాసాచార్యులు P.G.L.
సంస్కృత పండితుడు,
బోర్డు ఉన్నత పాఠశాల,
ధర్మవరము.

# పండితాభిప్రాయములు

మంచలకుట్ల పున్నయ్యశాస్త్రి భాగవతార్,
వేటపాలెం, గుంటూరు జిల్లా.

ఉ॥ పద్దెములల్లుచో చెఱకు పానకమందు
న ముంచి తేఖనిన్ దిద్దితివేమొ లేనిచో
చ, దివ్యమరంద రస ప్రవాహమ్మై ము
గ్ధులు గుల్కు సమ్మదనమున్ గలిగించెను
పండితాళికిన్ అద్విర చిద్విలాసశత
కంబు వినూత్నకళా విలాసమై

ఉ॥ వ్రాయగవచ్చు పద్దెములు వందలువేలుఫ
లంబదేమి? యౌరా! యని పండితో
త్తములనందగునట్టిదె సత్కవిత్వమా
మాయసమాన భాగ్యవిభవమెంతయు
మెచ్చుకొనంగజేసె నహా యని చిద్వి
లాసశతకంబును నంచితభక్తియుక్తమై

కం॥ ఈశతకము తమహార యోగాశ్రమ
వాసమును మోక్ష, గామికి నెంతో
ప్రాశస్త్యంబౌ మీకృతు లాశశితా
రార్కముగ ధరాస్థలి వెలయున్

మ॥ కనుగొంటిన్ తమ చిద్విలాసశతక గ్రం
థంబు సుజ్ఞానసాధనమై ముక్తిగోరువారి.

జ్ఞులకమందానంద నిష్యందమై ఘ
నసంసార భవార్ణవోత్తరణమై కామ్యా
ర్థకల్పంబునై దనరారెఁ భువి సుబ్బ
దాస సుకవీ! తత్వార్థబోధచ్ఛవీ.

ఉ॥ వన్నెయువాసియుఁ గలిగి ప్రాజ్ఞజన
స్తవనీయమైన మీ సన్నుతభక్తియోగము
ను, సాధుజనాదరణమ్ముఁగాంచి నే నె
న్నఁగపద్యరత్నముల, నిచ్చితి ప్రేమను
స్వీకరింపుమా పున్నయశాస్త్రియం
డ్రినను పూజిత రామపదారవిందుఁడన్.

ఇట్లు,
బుధజన విధేయుండు.

---

బిరుదరాట్ రంగరాజకవి,
రాచవీడు, కడప జిల్లా.

కం॥ శ్రీమృదులపదకవిత్వ రసామృత
లహరీ జనీపరిచంగ బ్రాహ్మీ ఘా
మా మానవసార్థక నామా
ధీసాంద్ర సుబ్బదాస కవీంద్రా.

సీ॥ ప్రకృతిసౌందర్యసం, పదలోనలీనమై
మీ భావమేవేళ మెరయుచుండు,
సత్యాన్వేషైకసంస్థాపనకేవేళ
మలయుచునుండు మీ మానసంబు
దీనజనావనానూనసంధానప్ర
వాహమైవెల్లు మీయూహలవహ
జంతుసంతానైక్య చింతనావ్యాప్తిమై
పరువిడుచుండు మీ గురుమతంబు

తే॥ అన్నిటనునిండి నీయందునన్నిగనుచు
నున్నవాడవునీవు నిన్నెన్నుటెట్లు
సన్నుతామలగుణ ధుర్యసాధువర్య
తత్త్వపరిభావి శ్రీసుబ్బదాస సుకవి.

ఆ॥ వె॥ చిద్విలాసశతక చిద్విలాసంబును
చవులుగురియుదాని జదివినాడ
దీనికిదియెసాటి దేనిబోల్పగరాదు
తతవిరాగి సుబ్బదాసయోగి.

కం॥ నెందాక నిసుసుధాకరు
నెందాకనుడుల్ప్రపంచ మీసర్వ
ము నిందెందాకమహిరహించును
యందాకను మీ కవిత్వమలరారు నోగీ.

ఇట్లు
భవచ్ఛ్రేయోభిలాషి.

మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ

డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు

ఎమ్. ఏ., పి. హెచ్. డి., ఎల్. టి., అనంతపురం.

శ్రీ సుబ్బదాసుగారు ఆంధ్రదేశమునకువలె నాకును చిరపరిచితులు ఆయన పరోపకార పారీణతను ధర్మసత్రమున స్థాపించి నిరంతరముగ సాగించుచున్న శంకరమఠమే ప్రత్యక్ష సాక్ష్యము.

శ్రీ సుబ్బదాసుగారు సుప్రసిద్ధకవులై యింతకుముం దెన్నో కావ్యనాటకాదులను రచించి ప్రఖ్యాతిని గడించిన వారు శ్రీ చిదానందసద్గురు చిద్విలాస అనుమకుటముతో వారిప్పుడు రచించిన యీశతక మాయన కవితానైపుణ్యమును మరింత చాటుచున్నది. ఇందెన్నియో అపూర్వములైన ఇతర కవులకందనట్టి యూహలు తొణికిసలాడుచున్నవి. శతక మంతయు నున్నతవేదాంతబోధ తోడను యోగవిజ్ఞానముతోడను నిండియున్నది. రచన ధారావాహిగా సర్వజన సుబోధముగానున్నది. శ్రీ సుబ్బదాసుగారిట్టి గ్రంథముల నింకనెన్ని యో రచింపగలరని ఆశించుచున్నాను. 17-5-48

ఆసద్ధాని దోవూ వెంకటస్వామిగుప్త
బెజవాడ

శ్రీ రాప్తాటి సుబ్బదాసయోగిగారి జీవితము సార్థకమైయినదన నాక్షేపణముండదు. వారు అనేకములైనసత్కార్యములుచేయుట చేయించుటయేగాక పెక్కు సద్గ్రంథములను సయితము వ్రాసినారు. ఆపొత్తములు కలియుగమునందలి యజ్ఞానులకుఁ వెల్గిగల్గింపుచు మోసగాండ్రు కుహనాగురువులు అగువారి చెయ్దముల నుద్ఘాటింపుచు మహోపకారకములైయున్నవి. వారు రచించిన "చిద్విలాసశతకము"ను గాంచు నవకాశము నాకుగల్గినది. అది మనోహరమైన భక్తి నీతి జ్ఞాన ప్రధానములైన దివ్య పద్యరత్నములతో నలరారుటయేగాక సర్వశక్తుఁడును, సర్వమయుఁడును, సర్వాత్మకుఁడైన సర్వేశ్వరుని సంబోధించునదైయున్నది. ధర్మవరమునందుఁగల వీరియాశ్రమము దీనజన ఆశ్రయముగను ప్రసాదింపుచున్నది. ఇట్టి దాస యోగిగారింకను సత్కార్యములనుగావించి లోకమందివారల సౌఖ్యలాభముగల్గుటకు దోడ్పడుదురుగాకయని నాహృదయ పూర్వకమైన అభిలాష.

తమ శ్రేయోభిలాషి.

ఆర్యోత్తములారా!

బ్రహ్మశ్రీ సుబ్బదాసుగారు నాకు బహుకాల పరిచితులు గాకపోయినను ధర్మవరమందలి శ్రీవారి ముఖ్యకార్య క్షేత్రమగు హఠయోగ ఆశ్రమమును లోకహితార్థమైన వారి వివిధ కార్యకలాపముల వివరములను వినుచుంటిని సంతసించుచుంటిని. శ్రీవారిని దర్శించ నభిలషించితి సాధ్యపడకపోయినది. కాలముగడచినది సంకల్పము సత్యమై నిష్కల్మషమైనదైనచో ఫలము సిద్ధించుట నబద్ధముకాదు.

బహుదూరములో యుండిన నేను కొద్దిదినములక్రితమే పెద్దబళాపురమునకు సర్కారువారిచే మార్పబడియుంటిని. శ్రీవారు కొందరి పండితోత్తములతో ననగా శ్రీ హట్టి శంకరరావుగారు, శ్రీ, భాస్కరపంత్ సుబ్బనరసింహశాస్త్రిలు, శ్రీ హఠయోగి నంజుండప్పగారు గురుకుల స్నాతకుల సత్యపాల్ యనువారు కురుక్షేత్రమునుండియు విచ్చేసియుండి ధర్మోపన్యాసములు జేయుచుండిన సుసమయము నా కప్పుడు లభ్యమైనది సంకల్పము సిద్ధించినది. శ్రీవారి పరిచయముప్పుడైనది. యేతత్ సమయమందే శ్రీవారి గ్రంథముల కొన్నిటిని చదివి చవిగంటిని. వారి జీవనచరిత్రమందలి వివిధఘట్టములను వింటిని విస్మయమందితిని. పవిత్ర భారతవర్షమందెందరో మహాత్ములుద్భవించి శ్రమించి సార్థక పవిత్రజీవితములు నడుపుటచే దేశోద్ధారక కార్యములెన్నియో నడుపబడినవి. ఇందుచే చిరస్మరణీయులగు మాతా పితృ ఋషి ఋణవిముక్తులై చిరంజీవులుగా యుండులాగు వీరి జీవితమును శ్రమింప

జేసి సార్థకపఱచుకొన నిర్ధరించుకొన్న సత్యసంకల్పము వ్యక్త మైనది. వీరుధార్మిక క్షేత్రమందేగాక రాజకీయములోను ప్రాచీనార్యధర్మప్రచారానుకూలమగు నాటకవిరచితులై తన్నాటకములందలి ప్రముఖపాత్రముల నభినయించి ప్రఖ్యాతులను వేతుగాంచిన వీరు విరాగులై దేశపర్యటనము గావించుటచే నచ్చటచ్చట మహాత్ముల సందర్శన సంభాషణ సౌలభ్యములబ్బుటచే ప్రాపంచక వేషభాష విషయాదులన్నియు నస్థిరములని తెలిసిన నీ ధీరవ్యక్తి తృతీయాశ్రమమగు వానప్రస్థాశ్రమములో బ్రవేశించి భవదీయ ధార్మిక కార్యక్షేత్రమును విస్తరింపజేసికొనిరి. పరులకై పరితపించిరి. అనాథులకాశ్రయులైరి దేశభక్తులతోటి కారాగృహవాస మనుభవించిరి. అతిసౌలభ్యమగు సరళ జీవితమభ్యసించిరి. ఉడుపులను మార్చుకొనిరి. నిస్వార్థసేవాదీక్షను గైకొనిరి బహుజనులకేకాక రాజ, జమీందారుల, ఆదరణలకు పాత్రులైరి. మానవ దురాచార దుష్కర్మములను ఖండించి మానవోన్నతికి అత్యావశ్యకమగు సత్య సనాతన సదాచార సద్ధర్మముల ప్రబోధమునకై గ్రంథరచనాకార్యమును గైకొనినదియేగాక హరికథ వ్యాఖ్యానములతో సామాన్య జనులను సైతము అజ్ఞానమను నిద్రనుండి లేవగొట్ట యత్నించిరి. సుజ్ఞాన సువిచార సారమును దాపించిరి.

వీరిక అతిపవిత్రమగు చతుర్థాశ్రమమును సన్న్యాసాశ్రమ ప్రవేశముతోటి తమ శేషజీవితములో భారత భావి జనాంగమున కావశ్యకమగు ఆశ్రమములను స్థాపించుచు భవదీయానుభవములతో గ్రంధములను రచింతురుగాక.

పేరు భవద్విరచితమగు చిద్విలాస శతకమును ఆమూలాగ్రముగ చదివి ఆనందించితిని. వీరిభాషాశైలియున్ననో అతి మృదుమధురమై సరళమై సముచితముగ నున్నది. వీరి కవితాశక్తి ఇతరకవులతో దీసిపోయినదికాదు. పద్యములన్నియు మిక్కిలి శుద్ధములై విద్వాంసులకేగాక సామాన్యులకు నైతము అర్థమగులాగున రచింపబడినవి. ప్రతిపద్యము పవిత్రభావపూరితమై పఠనయోగ్యమై ప్రకాశించుచున్నది.

గ్రంథమందలి విషయ విశేషములన్నియు ప్రాచీనాధునిక సిద్ధాంతములతోగూడి వైదిక రాజ నైతిక ఆర్థిక సామాజిక శారీరక మానసిక ఆత్మోన్నతుల కత్యావశ్యకమగు సద్విషయభూషితమై ప్రకాశించుచున్నది.

గ్రంథ మొకతూరి చదువ మొదలిడిన అజ్ఞానాంధకారావృతమగు మూర్ఖత మాయమై సుజ్ఞాన సూర్యోదయమగువఱకును క్రిందబెట్ట సాధ్యముకానిరీతిగ రచింపబడినదన్న అతిశయోక్తి కాజాలదని నానమ్మకము.

ఈశ్వరసృష్టిలోని చిద్విలాసములను వేదాంతములోని సత్యాంశములను జీవజంతువులయెడ మానవు డనదగువాడు నడచుకొనురీతి నీతులను కడుబీదలనుగాంచి పరితాపమొందు విధానములను జగన్మిథ్యయను యభిప్రాయ నిరసనమును నవనాగరిక వేషభాషలచే ననర్థవిధానములు కర్తవ్యపాలనముతోటి వర్ణనిర్ణయము భారత పతివ్రతల మహాత్మ్యములూ. భ్రాతృవాత్సల్య శమదమాదులుమద్య మాంసనిషేధానుకూల విషయ విశేషములు మున్నగువెన్నియో అమూల్యవిషయ విశేషరత్నములతో గూడియుండు భవద్విరచితమగు "చిద్విలాస"

మను సద్గ్రంథము ఆంధ్రలోకమందలి ఆబాల వృద్ధులగు స్త్రీ పురుషులందరి చేతులలో దనరారుచు కీర్తియశోవంతులుగను దేశ సుధారకులుగను భగవద్భక్తులుగను ధర్మపారాయణులుగను వీరులుగను ధీరులుగను చేయు సాధనమై శాశ్వితముగ దనరారుగాత.

పరమేశ్వరుడు ఏతత్ గ్రంథరచయితయగు శ్రీ సుబ్బదాసుగారికి ఆయురారోగ్య శక్తిసామర్థ్యములనిచ్చి లోకహితార్థముగ మరి నిట్టిగ్రంధములరచించులాగు ఉద్బోధించుగాత గ్రంధమును పఠించి విషయములను గ్రహించి ఆచరించిన గ్రంథకర్తగారి శ్రమ సాఫల్యమగును.

ధర్మప్రియుడు

యం. ఆర్యమూర్తి [సిద్ధాంత విశారద]

సూపరెంటెండెంట్

పెద్దబళ్లాపురం.

# మహారాజ పోషకులు

1. శ్రీ పాగాల బాలప్పగారు ధర్మవరము
2. ,, చిన్న మల్లప్ప శ్రేష్టిగారు ,,
3. శ్రీమతి చిన్న లక్ష్మమ్మగారు ,,
4. ,, భవనాసి ఆదిలక్ష్మమ్మగారు ,,
5. ,, కీ॥ బొంతల సావిత్రిమ్మగారు, పత్తికొండ
6. శ్రీ యస్. శ్రీనివాసులుగారు,
అడ్వొకేట్, అనంతపురం.
7. ,, పైడి లక్ష్మయ్యగారు, అడ్వొకేట్, అనంతపురం.

# రాజ పోషకులు

1. శ్రీ కాశెట్టి రంగప్ప అండ్ సన్సు ధర్మవరము
2. ,, పల్లెం శ్రీనివాసులుగారు ,,

# పోషకులు

1. శ్రీ వనసాడు శ్రీనివాసులు శ్రేష్టిగారు కుప్పం
2. ,, నామా వెంకటలయ్య శ్రేష్టిగారు ప్రొద్దుటూరు
3. ,, గిరిరాజు నారాయణస్వామిగారు ధర్మవరము
4. ,, కోటం మల్లేసుగారు ,,
5. ,, ముక్తాపురం నంజప్పగారు ,,
6. ,, కలవల వెంకటనారప్ప శ్రేష్టిగారు ,,
7. ,, కీ॥ దేవత నాగప్పగారు గంగినేపల్లి
8. ,, జి. వెంకటరెడ్డిగారు ఎమ్. ఎల్. సి. అనంతపురం
9. ,, మేడా రామయ్య శ్రేష్టి, సుబ్బయ్య శ్రేష్టిగార్లు,
అనంతపురం.
10. ,, కాకిమాని వెంకటస్వామి శ్రేష్టిగారు, ధర్మవరం.
11. శ్రీమతి ఆకల సీతమ్మగారు, ధర్మవరం.

# మున్నుడి

---

1925 వ సంవత్సరమున సుప్రకాశ శతకమును ప్రకటించియుండ నాప్రతులన్నియు త్వరలో నమ్ముడువోవ ప్రణవపీఠాశతకముతో కొన్నిపద్యములు చేర్చుకొని మరికొన్ని నూతనపద్యములనుగూర్చి చిద్విలాసమును మకుటముంచి ప్రచురించితిని.

నా మాతృదేవతయు; సంగీతకళా విశారదుడును, తత్త్వజ్ఞానియు బాల్యమునుండి నను సన్మార్గమున ప్రవర్తింపజేసిన పితృసమానులగు నా పెద్దన్నగారును, శ్రీ హరికథా విశారదుండగు నా రెండవ అన్నగారును, శ్రీ రాజరాజేశ్వరీ లబ్ధప్రసాదయగు నా సోదరీ తిలకమును నాయిరువురు భార్యలు వెంటవెంటనే మృత్యువువాత బడుటచేత మరుమరీచికలవంటి సంసారముపై నిస్పృహజనింప వైరాగ్యకవచమును ధరించి, హఠయోగాశ్రమమను పేర నొక ఆశ్రమమునకు శంకుస్థాపన మొనర్చి 1926 సంవత్సరమున తీర్థయాత్రనెపమున హిమవత్ప్రాంత పుణ్యనదులలో గ్రుంకులిడుచు తత్ప్రాంత వనభూముల సంచరించుచు హృషీకేశము, బదరికాశ్రమము; కేదారేశ్వరము అమరనాథ్ మొదలుగాగల యాశ్రమములను దర్శించి నేపాలు కాశ్మీరు మున్నగు పట్టణములగాంచి యందందుగల

బ్రికృతి సౌందర్యములగాంచి యచ్చెరువంది హృదయము నుండి పొంగి పొరలివచ్చు యానందవారాసిని గుర్తింకులిడుచు, పరమేశ్వరుని యచింత్య మహిమాతిశయములనుగాంచి హృదయము భక్తిచే తొణికిసలాడునపుడు రచించిన పద్యములనిందు పొందుపరచితిని. ప్రతిమనుష్యుడు కూపస్థ కూర్మమువలె కాలముగడుపక యొకతూరియైన హిమవత్పర్వత ప్రాంతముల సందర్శించి యందుగల భగవత్సృష్టి విలాసములనుగాంచి ధన్యత నొందకున్న జన్మ వృథయని విన్నవింతును.

నేనీవాన ప్రస్థాశ్రమమును త్యజించి నాల్గవయాశ్రమమగు సన్యాసమును స్వీకరించి మరియొకతూరి యాపుణ్యభూముల దర్శింప కుతూహలపడితిని. కాని ప్రాకృతపుణ్య పరిపాకమెట్లున్నదో తెలియదు.

ప్రకృతము కవిసార్వభౌములెందరో యుత్తమకావ్యములను రచించుచు కవిత్వమున నూతన మార్గములను ద్రొక్కుచు దేశోన్నతికి పాటుపడుచుండు నిక్కాలమున నే నీశతకమును ప్రచురించుట హాస్యాస్పదమైనను, నాయందు భక్తిగల శిష్యులు, మిత్రులు యీగ్రంథమును పఠించి నిష్కామకర్ములై దేశసేవ చేయుదురని విశ్వసించి యీపొత్తమును ప్రచురించితిని.

యీచిన్ని పొత్తమునకు దయతో పీఠికను వ్రాసియి

చ్చిన ధర్మవరము బోర్డు హైస్కూలు సంస్కృత పండితులగు శిరోమణి, విద్వాన్ శ్రీమాన్ కలచవీడు శ్రీనివాసాచార్యులు గారికి నాకృతజ్ఞతాభి వందనశతంబు లర్పించుచున్నాను.

ఈ గ్రంథ ముద్రణకై ధనమొసంగిన ఉదార మహాశయులగు మహారాజపోషక, రాజపోషక, అభిమానులకు నా కృతజ్ఞతాభి వందనములు. నేడు రేపుయని కాలవ్యవధిని పొడిగించక వెంటనే గ్రంధమును ముద్దుగ ముద్రించి సకాలమున నొసంగిన విశ్వనాథ్ ప్రెస్సువారికి వందనములర్పించెద. గ్రంథమున యేవేని స్ఖాలిత్యములున్న తెలియజేసిన పునర్ముద్రణ యందు సవరించుకొందునని విన్నవించుచూ విరమించెద.

ఇట్లు,
రాప్తాటి సుబ్బదాసయోగి
పాఠయోగాశ్రమము,
ధర్మవరము.



# చిద్విలాస శతకము



సీ॥ శ్రీకరుణారస - సింధువాత్సల్యైక
  పూర్ణుండవైన నీ - పూజ్యయశము
అణువణువాదిగా - నాబ్రహ్మ పర్యంత
  మావరించిన నీదు - నమిత మహిమ
నిఖిలజగజ్జాల - నిర్మాణమునఁ గడుఁ
  బ్రకటితంబైన నీ - ప్రాభవంబు
నిఖిలలోకంబుల - నిర్నిద్రశక్తిని
  గనుసన్న నడుపు నీ - కౌశలంబు

తే॥గీ॥ గాంచియుప్పొంగి నీతత్త్వ ♦ మెంచిపొగడి
భక్తితోలుకాడ మృదుల భా ♦ వములుపొదల
శతకమర్పింతు గ్రహియింపు ♦ హితమనీష
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ శ్రీదమై ఖేదాప - నోదమై కలిత వినోదమై

సంతతా మో - ద మగుచు

భవ్యమై సుజ్ఞాన - సేవ్యమై నిగమ వా

స్తవ్యమై సజ్జన - స్తవ్యమగుచు

సందమై సచ్చిదానంద - మై రుచిమూల

కందమై కల్యాణ - బృందమగుచు

లలితమై మాధురీ - కలితమై పారిక్ష్వణ్య

మిళితమై పీయూష - తులిత మగుచు

తే॥గీ॥ రుచిరమై సాధుజనసభా ♦ పరిచురమగుచు

శౌ:యునీపై నజెప్పఁ క ♦ విశ్వసరణి

నమృతవృష్టిని గురిపింపు ♦ మయ్యయీశ

చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ "ఓమ్నమ" యనిదొల్త - నోర్మదిద్దించిన

శేషాద్రిగురునకుఁ - జేతులొగ్గి

సంస్కృతాంధ్రములను - శ్రద్ధమై నేర్పిన

నల్లపగురునకు - నతులొనర్చి

లక్షణగ్రంథంబు - లను నచ్చఁజెప్పిన

గుణనిధియగు సుబ్బ - గురునిఁ దలఁచి

యొనర నాయుర్వేద - మును బోధ జేసిన

గొల్లూరు సుబ్బార్య - గురుని నెంచి

తే॥గీ॥ మఱియు నద్వైతమును బోధ ♦ పఱచి యోగ

సరణిదెలిపిన గురుసిమ్హ ♦ గురుని రామ

దాససిద్ధుల మది నెంచి ♦ వ్రాసినాఁడ

చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఆదికవీశ్వరుం - డైన వాల్మీకి శ్రీ
రామవృత్తమువ్రాసి - రహిఁజెలంగె
భవభూతియుత్తర - భాగంబుకరుణఁ జి
ప్పిలనాటకమువ్రాసి - పేరుగాంచెఁ
గవికులశ్రేష్ఠుఁడౌ - కాళిదాసుండు శా
కుంతలంబునువ్రాసి - గురుతఁబొందె
నిపుడు రవీంద్రుఁడు - ను పమానరహితమౌ
గీతాంజలివ్రాసి - కీర్తికెక్కె

తే॥గీ॥ నపుడునిపుడును నీభక్తు ♦ లైనకవులు
గలరుజగమునఁ దావక ♦ కరుణవడసి
ధన్యులైనట్టి సుజ్ఞాన ♦ ధనులుఘనులు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ మాటిమాటికిభక్తి - మాధుర్యముప్పొంగి
వినువారి మునులఁగా - వింపవలయు
అర్థమంతటవాక్కు - లందూరిసభ్యుల
వీనులవిందుఁ గా - వింపవలయు
భావమింగితముచే - బయట నచ్చొత్తిన
ట్లయి నభ్యులకుమది - నంటవలయు
రసముసవ్వించి మా - నసపుఁ జాంచల్యం
బు, నడఁచిబంధించివే - యంగవలయు

తే॥గీ॥ నొక్కమారిట్లు హరికథ ♦ నొక్కచెప్ప
మరలవిననేల వినివేఱు ♦ మాటలేల
నాఁటినుండియు నీభక్తి ♦ నాటుకొనదె.
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ గ్రామ్యముఁగై తలోఁ - గలుపరాదనువారు
గడుపులే యొప్పని - పలుకువారు
స్వస్వామ్యమడుగక - సాధింతు మనువారు
నడిగియే సాధింత - మనెడివారు
సంస్కారమున జాతి - చక్కనౌననువారు
చెడుతోవఁ బడునని - చెప్పువారు
వర్ణ భేదములుండ - వసతిలేదనువారు
సంకరంబగునని - జడియువారు
తే. గీ॥ ఇన్ని పోటీలలోఁబడి ♦ తన్నుఁగానఁగ
నిన్నిటను నీవు చేరియు ♦ నింద్రజాల
విధ మొనర్చితి విదియేటి ♦ విధముతండ్రి!
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ వ్యోమచుంబితమహో - ద్భుతహిమశైలమ్ము
భరియించుచున్న యీ - భరతమాత
నర్మదా గంగాది - నదుల నెల్లప్పుడు
భరియించుచున్న యీ - భరతమాత
సకల సస్యౌఘముల్ - ప్రకృతి సౌభాగ్యముల్
భరియించుచున్న యీ - భరతమాత
కనకరత్నములుండు - ఖనిసమూహంబుల
భరియించుచున్న యీ - భరతమాత
తే॥ గీ॥ దేశములనెల్ల మిన్నగఁ ♦ దేజరిలఁగ
వఱలుచుండెను మున్నిప్డు ♦ వాసిలేక
దుర్భరస్థితి నున్నది ♦ దురితదూర
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఉపమానరహితమీ-యుర్వినొక్కనిమోము
నీరేజముల మీఱు - నేత్రయుగము
పరికింపనొక్కని - పల్కుతే నియలొల్కు
పలుచాలు కుట్మల - పంక్తి గేరుఁ
గాంచనొక్కనినడ - కడురమ్యమై తోఁచుఁ
జూడనంగమ్ములు - సొంపుమీఱు
రమ్యమానొకనియు-రంబుఁ గాంచినయంత
కరచరణంబులు - ఘనతమీఱు

తే॥గీ॥ నహహా! నీసృష్టిచిత్రము ♦ సరసిజూడ
నిట్టిదట్టిదియనియూహ ♦ నెఱుగలేను
పొగడఁతరమానె నీశక్తి ♦ పూతచరిత
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ విద్యగల్గిననేమి - వినయము లేకున్న
ఫణిశీర్షమున మణి - బరఁగునట్లు
ధనమునుండిన నేమి - దానంబు లేకున్న
కాటిలోఁపువ్వులు - గలిగినట్లు
చెలువముండిననేమి - శీలంబు లేకున్న
బణ్యాంగనకురూప - మున్నయట్లు
శౌర్యముండిననేమి - ధైర్యంబు లేకున్న
నేపికినధికార - మిచ్చినట్లు

తే॥గీ॥ మనుజుడై పుట్టినంతనే ♦ మానెనెపుడు
లాతివారికి నపకార ♦ లవములేక
నిశిత సుజ్ఞాని గానిచో ♦ పశువుగాదె
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ధర్మస్వరూప యీ - ధరణీతలంబున
బహుజన్మపుణ్య సం - ప్రాప్తమైన
మనుజ జన్మంబిడి - మంచిజ్ఞానోదయం
బొందఁజేసితివయ్య - యోమహాత్మ
జ్ఞానకర్మేంద్రియ - ఘనశూక్ష్మపరికర
సముదయంబునఁ బూర్ణ - సౌఖ్యమొసఁగి
పంచభూతంబుల భవ్య - మా సూర్యచం
ద్రాది బ్రహ్మండ భ - టాళిఁగూర్చి
తే॥గీ॥ న్యాయరీతిని నడువనా ♦ న్యాయములను
దానమొసఁగిన సత్కీర్తిఁ ♦ దలఁచి నిన్ను
గాంచి ధన్యతఁబొందని ♦ ఖలునిబ్రతుకు
వ్యర్థమనిబల్కుదురు బుధా ♦ వళిజగాన ॥చి॥
సీ॥ సూరిజనులగాంచి - సుప్రభాతంబని
నమ్రుడై తలవంచి - నడచువాఁడు
పరదారలను జూచి - పలుకక తలవంచి
తల్లులను చుమదిఁ - దలఁచువాఁడు
హీనజాతులఁగాంచి - యెగతాళిఁ జేయక
భ్రాతృభావముచేతఁ - బరగువాఁడు
అగతికులనుజూచి - యాత్మరీతిగ నెంచి
యోపినంత ధనంబు - నొసఁగువాఁడు
తే॥గీ॥ దనరగుర్వాజ్ఞ శిరమునఁ ♦ దాల్చినడచి
సాధుసాంగత్యమెప్పుడు ♦ సలుపువాఁడు
ధరణి బరికించిచూడఁగ ♦ ధన్యతముడు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఉదయకాలమునందు - నిదురమేల్కొనివచ్చి
రొగి తల్లిదండ్రుల - కొనర మ్రొక్కి
మ్రొక్కియుష్ణోదక—మున భక్తినింపారఁ
దానమాడించియుఁ - దడీసినొత్తి
యొత్తిధౌతంబులా—మెత్తని వలువలు
మేనికినిండుగ - మొలఁగఁ గట్టి
కట్టియురసపూర్తి — నుట్టిపడెడు దివ్య
షడ్రసోపేత భో - జన మమర్చి
తే॥గీ॥ ఇచ్చియరంగ తాంబూల ♦ మిచ్చియక్క
రెసగమెసగంగ పితృపూజ ♦ నెనయచేయుఁ
టదియె స్వర్గాధ్వమందురో ♦ యమలకీర్తి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ తల్లిదండ్రులపూజఁ — దనరఁజేసియొకదా
పుండరీకుఁడు స్వర్గ పురముజేరె
తల్లి దండ్రులపూజఁ — దనరఁజేసియొకదా
యలసుధన్వుఁడు దివ్య — ఫలముఁబొందె
తల్లి దండ్రులపూజఁ - దనరఁజేసియొకదా
గురుపుత్రుడా బ్రహ్మ — పురముఁజేరె
తల్లి దండ్రులపూజఁ — దనరఁజేసియొకదా
పరశురాముఁడు మహా - భాగుఁడయ్యె
తే॥గీ॥ తల్లి దండ్రుల కెప్పుడు ♦ నుల్లమలర
బూజఁజేసెడివాడె పో ♦ పుత్రుడతని
వాఁడెభక్తులలోఁ పెద్ద ♦ వాడు తండ్రి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ కర్మానుసారంబు — గతియంచు నాయత్న
మావంత లేదని — యనెడువాఁడు
గ్రహచారమీరీతిఁ — గారింపుచున్న నా
యత్నమేమగునని — యనెడువాఁడు
గార్తాంతికుల్ జాత — కమువ్రాసినట్టుగ
ఫలము కాఁగలదని — పలుకువాఁడు
ఫాలమందేరీతి — వ్రాసెనో యాధాత
యారీతినగునని — యనెడువాఁడు

తే॥గీ॥ నలసుఁడజ్ఞాని దుర్మార్గు ♦ డాత్మవంచ
కుండు నారంభశూన్యుడు ♦ కుమతిగాన
నీకృపాపాత్రుఁడగునెవి ♦ నిర్మలాత్మ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ నిదుర లేచినదాది — నిదుర బోయెడిదాఁక
భవజలనిధిలోన — బాధపడుచు
వ్యవహార చింతయు — వ్యాపార చింతయు
కూరగాయలచింత — కూటిచింత
కొమ్మలపైఁ చింత — సొమ్ములపైఁ చింత
సుతులు లేరనుచింత — బ్రదుకుచింత
ధనముపైఁ చింతయు — దాయాదచింతయు
పశువులపై చింత — పసిడిచింత

తే॥గీ॥ ఇన్ని చింతలలోఁబడి ♦ తన్నుగానుచు
నదియెసుఖమనియెంచుచే ♦ యధము డతఁడు
నిన్ను గానక చచ్చునో ♦ కన్నతండ్రి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ జన్మమెత్తినదాది - చచ్చెడుదాఁకను
సకలపాతకము మూడ్కి - మెలఁగువాఁడు
అనిశంబు విషయాదు - లాశించియగ్నిలోఁ
బడినశలభమట్లు - జెడెడువాఁడు
తనకున్నదానిలో - దానమొసంగక
భ్రమరంబురీతిని - బరగువాఁడు
లాతిసతులఁగోరి - కేతకీగర్భస్థ
షట్పదంబులభాతి - జచ్చువాఁడు
తే॥గీ॥ నీకృపాపూర్ణమనమును ♦ నిలయమందు
చోటుగాంచక నీనామ ♦ సుఘనుఁగోరిల
వలనుపడకయుఁజెడును భూ ♦ వలయమందు
చిత్సుఖానంత సర్వేశ చిద్విలాస.
సీ॥ భార్యయుస్సురటంచుఁ - బడియేడ్చుచుండఁగ
వేశ్యాగృహముఁగూర్చి - వెడలువాని
జంతులవధమాన్పు - చందముఁ దలఁపక
చేపలగుత్తలు - చేయువాని
ఆఁడుబిడ్డలనమ్ము - గోడుదలంపక
సంఘసంస్కరణంబు - జాటువాని
భారతీయులుచాల - బాధలందుచునుండ
గల్లుపాటలుబాడ - వెళ్లువాని
తే॥గీ॥ అట్టివీరులనోక చంపఁ ♦ గొట్టి మంచి
మార్గమునుజూపి బుద్ధిని ♦ మాఱఁజేసి
దేశభక్తులఁ జేయుమో ♦ దేవదేవ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ అగతికసకు నింత — యన్నమిడరుగాని
కలవానికిత్తురు — కాంచనంబు
తలిదండ్రులకు సేవఁ — దనరఁజేయుదురుగాని
సానికాళ్లకుఁ బూజ — సలుపఁగలరు
నిఱుపేదకు నొకింత — నేలనియ్యరుగాని
గృహదానమిత్తురు — గేహికెలమి
గోనాశనంబొందు — గోడుఁగాంచరుగాని
మొద్దుబసవుఁగాంచి — మ్రొక్కుచుంద్రు

తే॥గీ॥ ధరణిఁదలపోయ రీసూక్ష్మ ♦ ధర్మములను
కుటిలవర్తనుల జ్ఞాన ♦ పటిమచేత
వారువారందరు నీదగు ♦ భూరికృపను
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ కూటికై పేదలు — కుయ్యిడుచుండఁగ
మూఁడుపూఁటలఁదిని — ముఱియువెట్లు
వసియింప బీదకు — వసతిలేకుండఁగ
మేడలపైనుండి — మెలఁగువెట్లు
మఱుపట్టమునులేక — నిరుపేదలుండఁగ
ఘనదుకూలములను — గట్టువెట్లు
దుమ్ములోఁదమ్ములు — దొరలుచునుండఁగ
పట్టుమెత్తలమీఁద — బండువెట్లు

తే॥గీ॥ అకట! జగమందు బీదల ♦ యార్తనాద
ములు వినంబడుచుండఁగ ♦ మూఢుకీతి
చూడనేరను కరుణయు ♦ జూపుమయ్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ మేలుమార్గకులగూల్చి — మేడఁగట్టుటకంటె
తాలకుటీరంబు — మేలుగాదె
మెత్తనిపాన్పుపై — మేనిఁ జేర్చుటకంటె
బరఁగఁబులిసముమీఁదఁ — పండఁరాదె
కాశ్మీరవస్త్రము — గప్పికొనుటకంటె
ఖద్దరు నొక్కింత — గట్టరాదె
మాంసంబుఁదిన ప్రాణి — హింసఁ జేయుటకంటె
ఫలరసంబులఁగ్రోలి — బ్రతుకరాదె
తే॥గీ॥ సంతకూటంబు వంటిసం ♦ సారమునకు
సౌఖ్యములఁగూర్పఁ బ్రాణుల ♦ జంపు టేల
పాపములఁజేసి దుఃఖంబుఁ ♦ బడయు టేల
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ కసవు మొక్కలచుఁగాన — వసియించుమృగమాల
కరుణఁబూనక చంపుఁ — కఠినుఁ డొకఁడు
ఫలభక్షణముజేసి — పాడెడు పక్షుల
నదయుఁడై కడ తేర్చు — నల్పుడొకఁడు
పుష్కరాంపు ముటికిఁ — బోకార్చుమీలను
వలవైచి చంపును — తులువయొకఁడు
వరిగడ్డిఁదిని పయో — వర్షంబుఁ గురియించి
జనులఁ బ్రోచెడుగోవు — చంపు నొకఁడు
తే॥గీ॥ కటకటా! వీరిహృదయముల్ ♦ కఠినశిలలు
జగతినిట్టి కటికలు ♦ చాలఁగలరు
వీరినెటుతిద్దెదో నింక ♦ వేదవేద్య!
చిత్సుఖాందన సర్వేశ చిద్విలాస.

సీ॥ ప్రాణులజీవిత — పద్ధతి దలపోయ
నబ్జదళముమీఁది — యంబుకణము
జగమున సంపదఁ — జర్చించిచూచిన
మించుతీవనుబోలె — చంచలంబు
దారసుతాదుల — తగులంబుఁగాంచిన
స్వప్నపయఃపాన — సదృశవగాను
పసమించుయవ్వన — ప్రాదుర్భవముఁగన్న
నోటికుండలలోని — నీటిబోలు
తే॥గీ॥ నహాహా! మృగతృష్ణఁబోలు సౌ ♦ ఖ్యమునుజూచి
నమ్మి నినుఁగాంచఁజాలక ♦ నరులుతునను
చెదలుభాతిగఁ జత్తురు ♦ చిద్విలాస!
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ కాలచక్రంబొక్క — లీల గిర్గుచునుండ
మృత్యువు తిన్నగ — మ్రింగనుంచ
రోగశత్రువులట్టి — మూఁగికారింపగ
గాసిఁబెట్టగ దుఃఖ — కంటకములు
వృద్ధత్వమనుపులి — వెంబడింపుచునుండ
భోగంబులను కలల్ — బోవుచుండ
మొహాశ్వమెల్లెడ — మురిసి పర్వెడుచుండ
చింతాగ్ని మిక్కిలి — చెలఁగుచుండ
తే॥గీ॥ ఏమిసుఖమని జనులింత ♦ తామసించి
మోక్షమార్గముఁ దలపక ♦ మురియుచుంద్రు
ఎపుడు విషయంబులనెబొంద ♦ నెంచుచుంద్రు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ కోటికిఁ గడియించు - కొన్న సరుండైన
గోచినై ననువెంటఁ - గొనుచుబోఁడు
అవనీధవుండేని - నంత్యకాలమునందు
నగ్నలంబగు చితి - బుగ్గియగును
అకలంక నవమోహా - నాకారుఁడైనను
వృద్ధుడుగాకట్టై - వెలయలేఁడు
వీరులగెలిచెడు వీర్యవంతుండైన
నిర్వీర్యుఁడై తుద - నీల్గి చచ్చు
తే॥గీ॥ లేశమేనియు నీదయ ♦ లేకయున్న
నెట్టివాఁడైన శుభముల ♦ నెలయలేక
పుడమినపగతనాముడై ♦ పొల్చునయ్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ దేశదేశంబులఁ - దెన్నుఁగానకయేగి
గాసిఁబొందుట పైఁడి - యాసగాదె
పదుగురాడెడి వక్రి - భాషణంబులనోర్చి
యాశ్రయించుట కాంచ - నాశఁగాదె
కృపణునిపై మంచి - కృతిఁ జేసికొనిపోయి
యంజలిచేఁత ధ - నాశఁగాదె
శ్వానంబువలె ధని - సదనంబుఁగాచుచు
దాసుఁడౌటయును పొ - న్నాసఁగాదె
తే॥గీ॥ మనుజుఁ డడి యాసలకుఁజిక్కి ♦ మాపురేపు
నెడఁద దలఁపక సిగ్గును ♦ నింతలేక
తిరుగుచుండును మదినిన్నుఁ ♦ దెలియలేమి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ధనికుని కడ కేగి — ధనము వేడిన సేవఁ
గొని లెక్కఁయిడి కొంత — ధన మొసంగు
చలిపందిరికిఁబోయి — జలములు ప్రార్థింప
నొకకొన్ని నీళ్లు పా — లకుఁడొసంగు
నన్న దాతను చేరి — యాచింప గొణుగుచు
నొకపూటభోజనం -- మొసగిపంపు
ప్రభువంత వానిని - వస్త్రంబుఁ గోరిన
గొన్నాళ్లు మను నొక్క - గుడ్డనిడడు
తే॥గీ॥ కాని నీయట్లు వేడ న ♦ క్కఱయ లేక
యాసదీరంగ నన్నియు ♦ రాసిబోసి
కొనుఁడు కొనుఁడని చెప్పువా ♦ రనఘ యేరి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ నిర్మలోదకపూర్ణ - నిమ్నగా జలములు
దాహంబు నణఁపవే - తలఁచిచూడ
పాదప పరిపక్వ - ఫలసంచయంబులు
నాఁకలి నణఁపవే - యరసిజూడ '
కట్టనిగృహములౌ - గ్రావగహ్వరఃములు
దలఁదాపఁజాలవే - తలఁచిచూడ
మార్గస్థ చేలముల్ - మానరక్షణమును
కలిగింపఁజాలవే - తలఁచిచూడ
తే॥గీ॥ ధనమదాంధుల దరిఁ ♦ జేరి ఘనవిరహిత
వృత్తివారలయాచింప ♦ వెడలు టేల
నిన్నుఁదలచిన శుభమగుఁ ♦ గన్నతండ్రి.
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఆప్యాయముగ జల్ది - యంబలిదా్రవియు
సంకటిచిక్కము - చంక జేర్చి
మూపుపై గొంగడి - ముస్తీబుగా వేసి
నాలమందలతోడ - నడవికేగి
మరలనోగిరంబు - మనసారదని లెస్స
మధురాంబువుల గ్రోలి - మందగూర్చి
నెల్లగిలారముల్ - నెమరులు వేయగ
గొండనెత్తము జేరి - నిండు ప్రేమ

తే॥గీ॥ సరణి! పిల్లనగ్రోవిని ♦ స్వనములొల్క
సృష్టిచిత్రము గాంచుచు ♦ సాక్షియుండు
గొల్లడే భూమిపతి మేటి ♦ కల్లగాదు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ సృష్టిలోని స్వభావ - సిద్ధమైరుచ్యమై
యారోగ్యమైన యా - హారచయము
ప్రాప్తానుసారంబు - తృప్తిమై భుజియించి
యత్యాసచేఁగల్గు - వ్యసనములను
జెందక చెట్లలో - స్వేచ్ఛగా నెలకొని
యింపుమీఱెడు తమ - యెల్గులెత్తి
నిన్ను గీర్తించుచు - నిరుపద్రవంబగు
జీవనంబుననురం - జిల్లునట్టి

తే॥గీ॥ పక్షులకునుండు సౌఖ్యంబు ♦ పరిగణింపఁ
బ్రకృతికి విరోధమార్గంబుఁ ♦ బట్టినడుచు
నరులకేటికివచ్చున ♦ సంతసూప
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ గ్రుడ్లిడు ఋతువుదా — ర్కొనుడు గుంపులుగూడి
పెద్దవృక్షములపై — విడిసియుచట
గూడుకట్టి యా — గూండ్ల గ్రుడ్డులువెట్టి
లవి వానిబొదివి పి — ల్లలనుజేసి
చిమచిమమని యని — చెంతముక్కులుసాప
నిడుద కుత్తుకలెత్తి — కడుపుగ్రిక్క
బాగుగా నెఱకలు — వచ్చుదాఁకను బెంచి
పదపడి వానిని — వదలివేసి

తే॥గీ॥ గూడులెగదన్ని చెట్లను ♦ గూడవిడచి
స్వేచ్ఛఁజను కోకురాయుల ♦ చెయ్వులెన్న
తనయులెడఁ గన్నవారి భా ♦ ధ్యతలునున్న
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఆశాసమీరణ — మ్మట్టిట్టుగొట్టగ
దుఃఖఫేనంబెస్గ — తొట్టగిలగ
మోహతరంగముల్ — మోదుచునుండఁగ
సుఖశీకరంబులు — చుట్టికొనఁగ
సుడిఁబోలు భార్యయు — జుట్టి త్రిప్పుచునుండ
సుతనక్రములుబట్టి — వెతలఁబెట్ట
బంధుకుళీరముల్ — బట్టిపీకుచునుండ
సోదర మీనముల్ — సుర్కఁజేయ

తే॥గీ॥ నకట! సంసారసాగరం ♦ బంతరింప
తావకధ్యానమను దృఢ ♦ తరణిగాక
యార్తునకు దిక్కువేరెద్ది ♦ యపరిమేయ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ సర్వ_స్థాణుదోహ – సౌందర్యగరిమంబుఁ
గలిమిఁజూడఁగఁ గన్ను – లిచ్చితయ్య
అవ్య క్తమధురంబు – లైన యూరావము
లింపుగవిన వీను _ లిచ్చితయ్య
షడ్రసంబుల రుచుల్ – చవిజూచి తెలియఁగ
నోనరఁగ రసనంబు – నొసఁగితయ్య
పరిస్ఫుటశీతోష్ణ – పద్ధతులెఱుఁగంగ
నోజఁ త్వగింద్రియ _ మొంచితయ్య
తే॥గీ॥ వాసనలఁజూడ నొసగిఁతి ♦ నాసికయును
పాపపుణ్యావివేచనా ♦ ప్రాప్తినొసఁగ
జ్ఞానమిచ్చితివయ్య వి ♦ జ్ఞానగమ్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ చెలువైనయట్టి నీ – సృష్టివిలాసంబు
చూడనికన్నులు _ పాడుదోనలు
నిగమసంస్తుత్యమా _ నీ పేరు నుమువుటఁ
గ్రాలనిరసనంబు – గరకసంబు
జ్ఞాననేత్రంబునఁ .— గనక నీరూపంబు
పులక మొందని మేను – బోదెగాని
జగధీశుఁడగు నిన్ను – సంస్మరించుటయందు
బరఁగని యాబుద్ధి – పాడుబుద్ది
తే॥గీ॥ అఖిలలోకఁబులను కుక్షి ♦ యందునిండి
యలరునీదగు మహిమనుఁ ♦ దెలియనట్టి
యోగిజన్మంబు జన్మమే ♦ యోగివంద్య
చిత్సుఖానంద సర్వేస చిద్విలాస.

సీ॥ ఏగోడలేమేడ - లేవాడలెనవచ్చు
నీసృష్టిఁ గందరా - నీకమునకు
నేపేటలేతోట - లేకోటలేనవచ్చు
నీసృష్టిగలవనీ - నిచయమునకు
నేసీతులేవ్రాఁత - లేచేతఁలెనవచ్చు
నీసృష్టిగొనియాడు - నియమములకు
నేయాటలేపాట _ లేమాటలెనవచ్చు
నీసృష్టిఁబడయు సం - తోసమునకు
తే॥గీ॥ నస్థిరమ్ముల నార్యమ్ము ♦ లస్వభావ
జంబులును దూష్యములగు మా ♦ చర్యకడను
నేడ ప్రాచీన పురుష! నీ ♦ సృష్టిచర్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ క్రిమ్మి మేఘంబులు _ గర్జించు నప్పుడు
ఘోరమైవర్షంబు - కురియు నపుడు
వెసఁబవమానము - విసరికొట్టిన యప్డు
మించుఁదీవలు మింట - మెఱసి నపుడు
మెండుగ నెండలు - మీరగాచిన యప్డు
శారదచంద్రికల్ _ చల్లునపుడు
చల్లని తెమ్మెర - నరవి వీచినయప్డు
పక్షులు లింపులుగుల్క - బల్కునపుడు
తే॥గీ॥ నీదుమహిమంబుఁ దిలకించి ♦ నిచ్చనలరి
కనుల నానందబాష్పముల్ ♦ గారుచుండ
బొగడుచుండును సుజ్ఞాని ♦ నిగమవంద్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఉన్నతాహార్యము - లుద్యానవనములు
జలపూర్ణ నదులును - బులినచయము
జలజలమని పారు — సెలయేటి నినదముల్
శుకపికమాధరీ -సుస్వనములు
చిత్రవిష్కుటములు - చిగురు జొంపంబులు
పౌర్ణిమారాత్రులు - పద్మవనులు
మలయమారుతములు - జలదబృందంబులు
గజిబిజి యనెడి మ - నుజ వితతులు
తే గీ॥ చూచుచుండిరొ యంతటఁ ♦ జూపుమఱచి
కనుల నానందబాష్పముల్ ♦ గారులుచుండ
నిన్నుఁగనుచుండు సుజ్ఞాని ♦ తన్నుమరచి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ అసమకూటోత్కరం — బసమసానువ్రజం
బసమ గుహానీక— మద్రిలందు
ఐసమవీచీపుంజ - మసమ తీరనికాయ
మసమవారిదవారి — మబ్ధులందు
నసమవృక్ష సమూహ — మసమ నదీజాల
మసమతలవ్యూహ మడవులందు
మసమాభ్ర సంజాత — మసమతారాగణం
మసమనర్ఘ శ్రేణు — లంబరమున
తే॥గీ॥ నెలకొలపి చిత్రితమ్మైన ♦ పలువిధముల
నందమును గూర్చితివివాని ♦ కౌర! నీదు
నేరుపననేర్పుగాక ♦ యింకేరి దయ్యు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఆకాశమద్భుత - మైనగుడారంబు
నలరురంగ స్థాన — మిలయిదెల్ల
తెరలు మాయామయ — పరికర నికరంబు
బాత్రివై చిత్ర్యంబు - ప్రాణిచయము
గట్టిమేళపుగాండ్రు — కామాదిషట్కంబు
మించు దీపంబులా - మిహిరవిధులు
వైచిత్ర్యమౌ కథా — వైదగ్ధ్య మీసృష్టి
యజ్ఞాన మనురాత్రి — యాడువేళ
తే॥గీ॥ గాటమైనట్టి యీజగ ♦ న్నాటకమును
నడుపుచున్నావు సూత్రిధా ♦ రుడవువోలె
నహహా! నవరసవైచిత్ర్య ♦ మహిమ మెప్ప
చిత్సుఖానంత సర్వేశ చిద్విలాస.

సీ॥ అంజలుల్ ముకళించి _ యర్ఘ్యంబుగొనుమయ్య.
దేవదేవయటంచు - ద్విజగణంబు
విరహమోర్వఁగఁజాల — మరుదెమ్ము మాదిక్కు
నీవునీవనిపద్మి - నీవ్రిజంబు
మాపాపముల మాపి - మముఁగృతార్థుల జేసి
బ్రోవుబ్రోవుమటంచు - బుధసమూహ
మిరులఁగామయ్య మా — యెడఁ గిన్కయిఁకమాని
కావుకావుమటంచుఁ — గాకవితతి
తే॥గీ॥ దైన్యమునఁ బ్రార్థనముసేయఁ ♦ దనకరముల
నల్లనల్ల నభువియెల్ల ♦ నాక్రమించు
భానుమూర్తియనంగ నీ ♦ బంటు దేవ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ నవనవలాడునం – దపుఁ జివుళ్లనుజూడఁ
గమగమలాడు పు – ష్పములుజూడఁ
గంటికింపగు సార – కాయగుత్తులుసూడఁ
బాడి తేనెలుగారు – పండ్లుసూడఁ
నెండఁ జల్లనిసీడ – నిచ్చుకొమ్మలు సూడఁ
శ్రమమార్పునాకు జొం – పములుసూడఁ
విశ్రమింపఁగఁ బీటఁ – బెట్టువేరులుసూడఁ
జెలఁగియూగంగ నూ – డలనుసూడఁ
తే॥గీ॥ నీకు మాఱొడఁగల్గు ని ♦ ర్ణిద్రమైన
మహాదుదార దయాసార ♦ మహిమయిట్టి
దనుచు సాటించుచుండు వృ ♦ క్షనివహంబు దేవ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ ప్రాభాత వేళ ని – ద్రలుమేలుకనిగూండ్ల
పలుకుపక్షుల కల – కలములందు
నిగిడిగుబ్బలుల క్రిం – దికిడిగ్గనుఱికి ఘో
షించు వాహినుల వీ – చికలయందుఁ
దొలుకరిమెఱుపుతోఁ దిలకింప నందమై.
గర్జిల్లు ఘనఘనా – ఘనములందుఁ
బూఁదేనె కడుపార – భుజియించి మత్తిల్లి
చరియించు భృంగప – క్షములయందుఁ
తే॥గీ॥ గవిశిఖామణులకుఁ జిత్ర ♦ కారకులకు
నిర్వచింపఁగఁ జిత్రింప ♦ నేరనట్టి
నీమహిమనివ్వటిల్లెడు ♦ నిజము దేవ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ గుత్తమై నిగనిగల్ - గుల్కు రేకులగూర్చి
పరితినించుకయులేక - నతికినావు
వింతలేచాయల — వితతి నెయ్యములాడ
నునుజాళువానిగ్గు - నుసచినావు
ఆమధ్యమ్మృదుకేస - రాళి సరాళింప
నాధారమునులేక — నాటినావు
ముద్దులొల్కెడుదిమ్మె మిద్దె - యొక్కెనుంచి
పూసలందందున - పూడ్చినావు

తే॥గీ॥ అహహా! పూవునకు తూండ్లనడుగున ♦ పాఁమరిల్ల
నర్కునకు చంచమామకు ♦ నలరముదువఁ
యుబ్జనిర్మాణ మెటుజేసి ♦ తయ్యెజెపుమ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ కొండలనడుమ నె - క్కుడు రమ్యమైయొప్పు
బయళులఁ గ్రీడఁ జే — ల్వారు తేళ్లు
పరిబ్బినమబ్బుల — కుబ్బి పురుల విచ్చి
యెడనెడఁ గునిసియా - డెడు నెమళ్లు
కొలఁకులఁదమ్ముల — నెలకొని వలిగాలి
నలలనుయ్యల లూఁగు — నంచపిండ్లు
సెలయేళ్లఁదరులఁ బ — చ్చికమేసి గొల్లలఁ
పిల్లగోవులకుఁ గం - పిల్లుపసులు

తే॥గీ॥ సిద్ధమును నిష్కలంకంబు ♦ నిశ్చలంబు
నిర్వికారంబు నిర్వచ ♦ నీయమైన
నీమహిమయిట్టి దనుచు వ ♦ర్ణించుదేవ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ పగలురాత్రులయందు - జగమును వెలిగించు
సూర్యచంద్రుల మింటఁ - జూపినావు
ఆఁకలిదప్పుల - యారాటమునుమాన్ప
ఫలజలంబుల భువి - నిలిపినావు
ఇహాపరంబుల రెంట - నెనలేని యానంద
మొంద శ్రుతిస్మృతు - లొసఁగినావు
సుకదుఃఖములరుచి - చూపి ప్రాణిచయంబు
జగతి నశ్వరమంచుఁ - జాటినావు
తే॥గీ॥ అన్నిటనునిండి బ్రహ్మాండ ♦ మందుఁపూర్తి
నొంది తగులక సాక్షివై ♦ యొక్కలీల
సర్వమును బ్రేమమెయిఁజూచి ♦ సమతవెలయు
నిన్ను నెంతని కొనియాడ ♦ నేర్చువాఁడ ॥చి॥
సీ॥ నింగితో నొఱసి ఘూ - ర్ణిల్లువరళ్లతోఁ
కడుభీకరంబైన - జడధియేని
శ్రవణకఠోరమో - జంఝూనిలములతో
మిగుల దిగుల్గొల్పు - గగనమేని
గాడాంధకార సం - గతమైనదరులలో
భయముపుట్టించు ప - ర్వతములేని
ప్రాణకూటకమైన - ప్రాణిలోకములతో
భీత్యావహంబైన - పృథ్వియేని
తే॥గీ॥ కైవసముచేసికొను బుద్ధిఁ ♦ గలుగఁజేసి
పెద్దఁజేసితినరుని నీ ♦ విద్దెసుద్ది
తరమె వర్ణింపఁగా మహా ♦ త్మా! మహేశ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ రవికరపంక్తిఁ బా - రావారమునుగాఁచి
విరివిగాఁదేలు - నావిరులఁజేసి
యాయావిరులను శీ - తానిలంబులఁగూర్చి
కడువడి గొప్ప మే - ఘములొనర్చి
యామేఘరాజి ను - ష్ణాంశుదీధితులచే
మరియు వర్షములుగా - మార్చివైచి
యావర్షధారచే - నతిచిత్రముగ నోష
ధుల భూమినంతట - మొలవఁజేసి

తే॥గీ॥ యట్టి యోషధీబృందమ ♦ నంతకోటి
జీవరాజంబుఁబెంచి ర ♦ క్షించువాఁడ
వలఁతియే నీమహత్త్వంబుఁ ♦ దలఁపదేవ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ పగలు జంతువులెల్ల - బనిచేసి యలసిన
నూఱడిల్లగనిద్ర - నొసగినావు
నిదురించు ప్రాణులఁ - గదసి యాపదలేక
కాచుచునెప్పుడు - బ్రోచినావు
తొలిజామునను వేగ - మెలఁకువఁ గలిగింప
నొసఁగితి కుక్కుట - విసరములను
మాంద్యముంబోగొట్టి - మలయమారుతమిచ్చి
యొనరఁగ స్థైర్యము - నొసఁగినావు

తే॥గీ॥ శారికా కీరపికపాళి ♦ యారవముల
నమితసంతోష మొసఁగితి ♦ నయ్య నీవు
నీదు మహిమము పొగడంగ ♦ నేరనయ్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ మృగములవేఁజాడి — మెసవిఁ యాఁకలిదీరి
గుహాగ్రమాఁగను వెట్టు — మృగవిభుండు
నీటిలోనున్కిమా — నితటంబునం దెండ
నిసుకతిప్పలపొర్లు — మొసలిఱేఁడు
నంతకంతకునున — బోంతరంబెగఁబ్రాఁకి
పయ్యెరవిహరించు — పక్షిరాజు
విరులవాసనలచేఁ — బరిమళించుసమీర
ములకు వాయుడిపోలు — చిలువదొరయు

తే॥గీ॥ సిద్ధమునౌ నిష్కళంకంబు ♦ నిశ్చలంబు
నిర్వికారంబు నిర్వాచ ♦ నీయమైన
నీమహిమయిట్టిదనుచు వ ♦ ర్ణించు దేవ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ముద్దులనొనగూర్పు — మురిపముచేబాలు
రాటలాడెడివిధం — బరసినపుడు
మృగశాబకంబులు — మొక్కతృణంబులఁ
బరుగులెత్తెడిచంద — మఁగసినపుడు
పక్షులగుంపు ప్రి — భాతవేళలయందు
మించిపల్కుట నాల — కించినపుడు
పచ్చికసవుమేయఁ — బరువడిఁ బాలూర
నంబా!యనుచు ధేను — వఱచునపుడు

తే॥గీ॥ ఎవఁడు నీసృష్టిచిత్రంబు ♦ లెంచిపొంగి
కనుల నానందబాష్పముల్ ♦ గార్చిమెచ్చి
నిన్ను బొగడక యుండును ♦ నిర్వికార
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ మాయయూర్పులనుసోకి - మాలిన్యమందిన
పవనునిఁ బరిశుభ్రి - పఱచుటకును
మాతనుస్పర్శచే - మాలిన్యమందిన
వారిని బరిశుభ్రి - పఱచుటకును
మాయెంగిళ్ళచేత - మాలిన్యమందిన
వసుధను బరిశుభ్రి - పఱచుకుటను
మాకుక్షినున్కిచే - మాలిన్యమందిన
వహ్నిని బరిశుబ్రి - పఱచుటకును
తే॥గీ॥ తరులతాక్రిమిపక్షి మ ♦ త్స్యతృణకీట
కాదులను సృజియించి మా ♦ మీద ప్రీతి
వత్సలతఁ జూపితయ్య ♦ యవ్యాజకరుణ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ తెల్లని నురుఁగా - జిల్లనంతంతలై
యరుదెంచు మున్నీటి - తఱఁగలందుఁ
బడమట రవిగ్రుంకు - పట్టున గగనంపు
జానగు సంజకెం - జాయలందు
దూదిపింజలమాటిక్కి - దోఁచు మొయిళ్లలో
నింపారు పండువె - న్నెలలయందు
బూలవల్లుఁ జవుళ్లు - పొల్పునా నాతరు
తతివెల్గు గిరుల - నెత్తమ్ములందుఁ
తే॥గీ॥ గవిశిఖామణులకుఁ జితి ♦ కారకులకు
నిర్వచింపంగఁ జితిరింప ♦ నేరనట్టి
నీమహిమ నిప్పటిల్లెడు ♦ నిజముదేవ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఏమి నీయద్భుత - ధీమహిమము దీని
వర్ణింపనెవ్వని - వశము తండ్రి
యొకచెప్పపాటున - సకలలోకములందుఁ
బుట్టి ప్రాణులవెన్నొ - గిట్టుచుండు
నొక నిమేషములోన - నున్న ప్రజాళికి
కష్టముల్ సుఖములు - గడచుచుండు
నొకముహూర్తమునందు - నొగిదరిద్రుఁడు ధని
ధనికుఁడు బీదవై - దనరుచుండు

తే॥గీ॥ అహహ! యిమ్మాటిక్కచిత్రము ♦ లహరహంబు
చేయుచుండిన వచ్చునా ♦ దాయమేమి
నీకుఁదగునయ్య! యీయాట ♦ నిర్వికార
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ నెత్తుట వెదజల్లు - నిద్దంపుమంకెన
రంగుతోఁ దొలుత బే - రములుపల్కు
అందాలమూటవై - యలరు గన్నేరుకెం
జాయతోఁగొంత హా - స్యంబులాడి
కనుల కింపొసఁగుచుఁ - దనరు తామరపువ్వు
లేవన్నెఁభిదప గే - లింత సలిపి
వెన్నకన్నను మేలు - వన్నెతోఁదగుకుంద
కాంతిని దుదకుది సంతుగొట్టి

తే॥గీ॥ వెల్గుజెల్లెల్ల శారద ♦ వేళలందు
జగమున కొసంగు సంతోష ♦ సౌఖ్యమెల్ల
నీదు శాసనమునఁగాదె ♦ నిష్కలంక
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ భువనజాలములెల్ల - బొంగరంబులరీతిఁ
దిప్పెడు నీదివ్య - తేజమునకు
నక్షత్రరాసుల - నానాగ్రహంబుల
గనుసన్న నడుపు నీ - కౌశలమునకు
అఖిలలోకంబుల -నంతశాళమునందు
స్థిరముగ నిల్పు నీ - చెయ్యిమునకు
చిత్రచిత్రముగాను - సృజియించి జీవుల
కాహారమొసఁగెడు - నమితకృపకు
తే॥గీ॥ నలరిమెవ్వాఁడు నినుఁగాంచ ♦ దలఁపమదిని
నాశఁబొందడు వాడెపో ♦ యమితపాపి
వానిజన్మము వమ్మగు ♦ వసుధయందు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ మృద్వారిశిలల సం - మ్మేళనంబున నెట్లు
పృథ్విగుండ్రముగఁ గా - వించినావు
దానినాధార మిం - తయు లేక యెట్టులం
బరముననుండ నే - ర్పఱచినావు
మఱియు దానిని విశ్రీ - మమ్ములే కెట్లుబొం
గరముచాడ్పున ద్రిప్పగ - గలిగినావు
చెట్టుచేమలు మఱి - జీవరాసులు దానఁ
బడ కెట్లు పదిలంబు - పఱచినావు
తే॥గీ॥ సూర్యచంద్రాదులును దిగ్గు ♦ చుండుపగది
యెట్టులొనరించి యుంచితి ♦ వేదవేద్య
నీదుకనుకట్టు విద్యలు ♦ నీకె తెలియు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ మృగములనడవి వా – ర్దించి బొబ్బలువెట్టు
వ్యాఘ్రి మేస్గునకు లో – బడి యడంగు
నట్టిబెబ్బులులని – రాయాసముగఁ జంపు
కరి సింగమునుగన్న – వెఱచిపఱచు
నట్టి కరీంద్రంబు – నణుమాత్రమున జీల్చు
హరిసరుఁగాంచిన – నడలిపాఱు
నట్టిహర్యక్షంబు – నణువుగా వేటాడు
నరుడు నల్లి నిగాంచి – పరితపించు

తే॥గీ॥ బలమనిన నీసహాయ తా ♦ బలముగాని
తనుబలంబును బుద్ధియుం ♦ దలి బలంబు
బలములే ప్రాణికోటికి ♦ పరమపురుష
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఆఁకొన్నయప్డు దా – హముఁగొన్న యప్పుడా
హారంబు నీతంబు – నలవరించుఁ
గుడుచునప్పుడు వాన – గురియునప్పుడును
నాస్తరణంబు శరణంబు – సంతరించు
నెండనున్నప్డుఁ శా – యితముఁ గోరినయప్డు
ఛత్రంబుఁ బత్రంబు – జతనుపఱచు
శ్రమజెందినప్డు శై – త్యము బాధలున్నప్డు
అనిలంబు ననలంబు – ననువుపఱచు

తే॥గీ॥ తాళవృక్షంబుసామాన్య ♦ తరువుచూడ
బీదలకు నన్నదాతవు ♦ కాదెనీవు
దానినిర్మించుచే దయా – ర్ద్రితకుసాక్షి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ గురుగుబచ్చలిగోంగు — గొబ్బిచెంచలి మెంతి
కూరలునాంగ నాం — కులను దెచ్చి
మిరపకాయలు నూనె — కఱివేపయింగువ
చింతపండుప్పును — జేరఁజేసి
యెల్లుల్లి కొబ్బెర — బెల్లము పదునుంచి
రాతిరుబ్బుచు తిర్గ — వాతనుంచి
పిండమాంచునుయూరి — బిండియొక్కటిజేర్చి
పొట్టబగుల దాని — నట్టెమెక్కి
తే॥గీ॥ రోగమేవేళఁబెంచి యా ♦ రోగ్యమునఁగు
ప్రకృతిగానక పర్విడు ♦ ప్రతిభనేర్చి
పాపినఁకొనుటిది మాన్వ ♦ భావమయ్య.
చిత్సుఖానందన సర్వేశ చిద్విలాస.

సీ॥ ఫేణిలాడుజిలేబి — పిండికుడుములును
పాలహోళిగలాది — భక్ష్యతతియు
కడుగుచికరములో — కడపపిషాణంపు
యాదృచ్ఛికంపు శా — ల్యన్నతతియు
కందవంగపొట్ల — కాకరకాయలు
చాలరీతులుగల — శాకతతులు
అనటిఫలంబులు — నామ్రఫలంబులు
పనసఫలములాది — పండ్లచాలు
తే॥గీ॥ ధరణినుండఁగ వీనిని ♦ నరులువిడిచి
మాంసమును మెక్కుచుందురు ♦ హింసయనక
వారిజఠరంబులెట్టివో పరమపురుష
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఎండఁబైత్యంబది — యుందకుమా దేహ
మునకని యొకమందుఁ — గనెడివారు
వానసైత్యంబుమా — మేనికిఁ దగదంచు
మితిలేనిమాత్రల — మ్రింగువారు
గాలిసోఁకినదెబ్బ — ఘుటియిల్లుమాకని
తగనికాషాయముల్ — ద్రాగువారు
నేలఁగూర్చున్న జ — న్మి యెట్లుమింగుమన్నని
భస్మముల్ సేసి సా — పడెడివారు
తే॥గీ॥ సైతిమిరాగతిఁ బ్రకృతికి ♦ వ్యతికరించి
భూదములనెల్లఁ పెను ♦ భూతములుగ జూచు
మాకు నీజోలియేటికి ♦ మంచిదగును
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ పరఁగనాయుర్వేద — పద్ధతిగనియును
వస్తుతత్త్వార్థంబుఁ — పడయులేక
గజపుటంబులు ద్రుంతుఁ — గాఁవభస్మంబులు
చేయుచు కుజవోవఁ — జేయులేరు
అరయసీరమెమందు — ధరణియె యొకమందు
నిసుకదిబ్బలుమందు — కసవుమందు
కొండనెత్తంబును — నెండయే యొకమందు
మలయమారుత మొక — మంచిమందు
తే॥గీ॥ వలయుమందులు భవరోగ ♦ వైద్యుఁడైన
నీవు సులభముగ వీని ♦ నెటిసృజించి
యిచ్చితితరౌమధములెల్ల ♦ చేటికయ్యె
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ స్వచ్ఛమైయద్దంబు — వడువునపతిబింబ
మలసినునిర్మల — సలిలరాశి
కల్మషంబింతేని — గలుగకశుభ్రంబు
నలువుచువిహరించు — జలచరములు
వింతవన్నెలసంగ — వికసించికడునొప్పు
పూవులెసంగునం — బోజతలు
మృదుమృణాలంబులు — మెసవిపూలవసించి
యళిపంక్తిఁదోలు రా — యంచగములు

తే॥గీ॥ పొలుపుమీఱంగఁ గనులకింపులుఘటించు
కొలకులనుజూడ నీదయా కలనమాకు
హృదయమెడఁబాయదయ్యన ఖర్వేశదేవ
చిత్సుఖానంత సర్వేశ చిద్విలాస.

సీ॥ బురుజులతో వప్ర — ములుగట్టఁగావచ్చుఁ
గొండలుపిండిగాఁ — గొట్టవచ్చు
నదులుదాఁటగ వంతె — నలు వేయగాఁవచ్చు
కడలిపైఁ బొగయోడ — నడుపవచ్చుఁ
దమకుదామరుగు ర — థములమర్పఁగవచ్చుఁ
నింతలోయోజనా — లేగవచ్చుఁ
వేనవేల్ ప్రజలొక్క — పెట్టుచంపఁగవచ్చుఁ
సురలోకమెల్లఁ దిర్మ్మరగవచ్చుఁ

తే॥గీ॥ గాని నీసృష్టిలో నొక్క గడ్డిపోఁచ
వంటి వస్తువు నేనిఁ గ ల్పనము సేయ
జాలుదుమె దేవ! యిదియె మా నత్తువనగ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఒకచేపఁబురడించు - చుదధిమధ్యంబున
నలలపై కెగఁబ్రాకు - చటుగునావ
గొండచిల్వవిధానఁ - కుధరసానువులందు
దొ్రఁచుచుబుసకొట్టు - ధూమశకటి
చుక్కసంగతియాపు - జూపట్టువింతగా
ద్యోవీధివిహరించు - వ్యోమయాన
మలనుడిగాలితోఁ - బొలిచిరివ్వన శీల
పఱచు విద్యుచ్ఛక్తి - బరగు తేరు
తే॥గీ॥ వీనికన్నిటికినిడావ ? కీనరక్ష
పొసఁగకుండిననాపద ॥ పొసఁగకుండ
నేముజీవించు తెఱవున్నె ॥ నిర్మలాత్మ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ ఎవరిఁప్రాపకమెంచి - యెలమి నాపాండవుల్
కష్టముల్ తృటిలోన - గడపినారు
ఎవరిఁదిక్కు దలంచి - యెలమి త్రిశంకుని
తనయుఁడు రాజ్యము - ధారవోసె
ఎవరియండఁ దలంచి - యెలమి శ్రీరాముఁడు
వారధిసేతువుఁ - బరగఁగట్టె
ఎవరిఁ సహాయంబు - నుంచిసుత్రామఁడు
ఘోరవృత్రాసురుఁ - గూలనేసె
తే॥గీ॥ వారలందఱు నీభక్తి ॥ వరులుగాన
పరమప్రీతిని శుభపరం ॥ పరలనిచ్చి
దివ్యకీర్తిని నిల్పితో ॥ దేవదేవ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ నేలఁబడ్డంతనే - నిలచితొట్రిలుచుఁనేఁ
దల్లి చన్నులు వేఁగ - తడవి కుడుచు
బుట్టినంతనె చేటఁ — బొరలుచు సరశిశు
వాకటఁగావుకా - వనుచు నేడ్చు
సండంబు వెల్వడి — నంత నేపిట్టలు
తిండికై ముక్కులు -- తెఱచియఱచు
గుంటుగుంటుమటంచు — గుక్కకూనలు కనులి
విప్పకయే తల్లి — వెదకి చేరు
తే॥గీ॥ ఏటిరియాకలి యోతల్లి — యెవరొ మేత
ననఁగ నేమియొ యేద్వనే — మగునొ తెలియ
నేరని నిసుంగులకుసివి ♦ నేర్పెరెవరు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ పరదేశమున కేగి — పతియింటికే తేర
సాధ్విప్రియుసిఁ జూచు — సంబరమున
పొదుగునఁబాలూర — గదియు దూడకు దాపి
మేనునాకెడి గోవు — మెప్పునందు
ఎఱఁదెచ్చి ముకుపచ్చ — లెండసిపిట్టల
కిచ్చెడు పత్నుల — మమతయందు
పాలకేడ్చెడి చిన్ని — పాపకుఁ జన్నిచ్చి
ముదముజూపెడి మాత ముద్దులందు
తే॥గీ॥ నీదుకరుణా విధంబునె — న్నే! విధాల
జ్ఞానిగనుచుండు నిక్కము — జ్ఞానగమ్య
గర్వదగ్ధులు చూడంగ — గలరె తండ్రి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ పవలెల్ల మాకు న - పర్యలు గావించు
నంబరమణి కేమి - సంబళంబు
రేలెల్ల మేము ని - ద్రింపఁ గావలిగాయు
శీతభానునికెంత - వేతనంబు
నోరంత పొద్దుమా - కూడిగంబులొనర్చు
పవమానునకు నేమి - ప్రతిఫలంబు
భుజియింపఁగా మాకు - భోజనమొనగూర్చు
భూదేవికే పాటి - పూటకూలి
తే॥గీ॥ వంటవార్పులలో సాయ ♦ పడుచు మాకు
సేవలొనరించు వహ్నికిఁ ♦ జీత మెంత
పలుకు మో దేవ! నీబరా ♦ వర్జు జూచి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ పాకీనివలె దొడ్డి - పట్లదుంపలు ద్రవ్వి
చొఱవచేఁ దినిపోవు - సూకరంబు
ప్రాచిదానవటంచు - వాకిళ్లనెండు ధా
న్యములఁ బుక్కిటఁబెట్టి - యురుగుగాకి
తలవరినంచుఁ ద - ల్పులుఁ ద్రొబ్బి పళ్యానఁ
గూడెల్ల గదుకును - గుర్కురంబు
కొట్టుకాపు నటంచు - నుట్టిపై కెగఁబ్రాకి
పాల్పెరుగులు మెక్కు - పఱచుఁ బిల్లి
తే॥గీ॥ కొలుపుభృత్యంబు నెఱిగిచే ♦ కొనుటతగవు
గానియిటుచేయుదురె యెంత ♦ కష్టపడిన
వీరికెవరిచ్చిరీ యధి ♦ కారములను
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఆత్మ యేయుష్టియు - నాలోచనంబగ్ని
ఇద్మంబు దేహము - హింసదమము
వేదివక్షంబును - వెంట్రుకలా కుశ
లమరఁగ శిఖయును - యజ్ఞభూమి
ఆజ్యంబు కామమహా - నమితకోపము పశు
వగు హృదయము యూప - మగునటండ్రు
శమవిధానంబు పరి - శస్త్ర దక్షిణయును
ఋత్విజులై యొప్పు - నిందిరియములు
తే॥గీ॥ ఆపురోడాశమును యుష్మ ♦ ద్దైక్యమగును
అనుచుస్మృతి పల్కుచుండుట ♦ నరయలేక
హింసగావింతురి సవమని ♦ హంసరూప
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ ప్రజల బిడ్డలరీతి - రాణనేలనివాఁడు
రాజు గాడతఁడుగో - రాజుగాని
తలిదండ్రులకుఁ పూజ - దనరఁ జేయనివాఁడు
కొడుకు గాడతఁడు దుం - దుడుకుగాని
పతియాజ్ఞలకు మాఱు - పలుకుచుండెడియాలు
ఆలుగాదది చెడ్డ - తేలుగాని
భార్యకుద్రోహంబుఁ - బరఁగఁజేసెడివాఁడు
భర్తగాఁడతఁడు సం - హర్తగాని
తే॥గీ॥ నిన్ను భూతదయాళుని ♦ నిర్వికారు
దలఁచి యానందజలధిలో ♦ వెలయనట్టి
మనుజుఁడాతఁడు నిక్కపు ♦ దనుజుడయ్యె
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ రామచంద్రునిఁ గన్న — రమణి కౌసల్య యే
భారతమాతకుఁ — బట్టుగొమ్మ ..
అభిమన్యుఁగన్న యా — యతివ సుభద్ర యే
ధారుణీసతి కంఠ — హారసుమణి
భరతునిఁగన్న యా — ప్రమద శకుంతల
భూదేవి కింపగు — భూషణంబు
అర్జునుగన్న యా — యంగన కుంతి యే
మేదినిసామ్ముల — మేలుబంతి

తే॥గీ॥ ఇట్టిసాధ్వీమతల్లులఁ ♦ బుట్టఁజేసి
హైందవావని కీర్తిని ♦ బొందజేయు
వయ్య! సజ్జన సన్నుత ♦ యువతుల చరిత
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఎండకన్నెఱుఁగని — యింతులఁ జెఱనుంచి
నరకుఁడే సౌఖ్యంబు — జగమునఁబొందె
అన్నలరాజ్యంబుఁ — నాక్రమించిన ద్రోహి
యల సుయోధనుడేమి — ఫలముబొందె
గర్వించి నావంటి — ఘనుఁడు లేఁడనిమిడి
కశిపుఁడు నెంతటి — కాలముండెఁ
పరుల శ్రేయస్సును — నోర్వనికట్టిడి
ఖల శిశుపాలుఁడే — ఫలముఁబొందె

తే॥గీ॥ గాన దుర్బుద్ధులను మాని ♦ మానధనుఁడు
"ఆత్మవత్సర్వ భూతాని" ♦ యనెడునీతిఁ
దెలిసిసౌఖ్యము నొందును ♦ దివ్యచంద్ర
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఘోరాటవులఁ దన్నుఁ - గోరుబోయనిఁగాంచి
దమయంతియే నీతిఁ - దగవచించె
రక్కసి మూఁకచే - రక్షితయగు సీత
దశకంఠు కేరీతి - విశదపఱచె
కీచకు మోహాగ్ని - కీలలు చల్లార్ప
ద్రౌపది యేనీతి - దగవచించె
పేరాశచేఁ దన్నుఁ - జేరఁగోరు నవాబుఘు
కేరీతి శచి నీతి - నెఱుఁగఁ బల్కె
తే॥గీ॥ ఇట్టి నీతివిహారిణుల్ ♦ పుట్టెఁగాదె
భరతఖండంబు ఘనకీర్తి ♦ వడసి నీతి
నన్యఖండంబులకుఁ బంపి ♦ మాన్యమగుట
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ తలవంచి పతిసేవఁ - దవరఁ జేయనియాలు
ఆలుగాదది వెల - యాలుగాని
పరుసంపు మాటలఁ - బలుకుచుండెడి భార్య
భార్యగాదది దుష్ట - చర్యగాని
సుఖదుఃఖముల రెంటి - జూడకుండిన దార
దారగాదది మహా - క్రూరగాని
అతిథి సంతర్పణ - మాచరింపనిజాయ
జాయగాదది గొప్ప - దాయగాని
తే॥గీ॥ ఇంటఁకాలూన కెప్పుడు ♦ నిరుగుపొరుఁగు
టిండ్లుదిరుగుచు పతిమాట ♦ నెదనఁదలఁప
కుండు నా నారి పెనుఘోర ♦ మారిగాదె
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ నిక్కుపులేడీల - వెక్కరించిన రీతి
పక్కపాపటలతో - నిక్కువారు
పసపు కుంకుమలేల! - పనికిరావని వీడి
ఫేసుపౌడరుఁబూసి - వెలయువారు
చలువబట్టలకంటె - జాకెట్లు గౌనులు
మేలనిధరియించి - మెలఁగువారు
సీకాయపోడుమేల - చెలువుపోవు నటంచు
బూడిదసబ్బులఁ - బూయువారు
తే॥గీ॥ చేతిగుడ్డలుల్యావండ్రు • సెంటుబుడ్లు
వాడుకొనువారు ధనమును • పాడుచేసి
స్వీయజనులకు ద్రోహము • జేయువారు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఆంధ్రమా! నాన్సెన్సు - ఆంగ్లంబుతో సాటి
భాషగాదిది యని - పలుకువారు
రామాయణంబేల - రైనాల్డ్సు నావెల్సు
బోలునా? ఛీయంచు? - ప్రేలువారు
పాశ్చాత్యజనులచేఁ - బ్రభవించె జ్ఞానంబు
మన కసలెక్కడి - దనెడువారు
"డర్టీఫెలోన్" మన - డ్యామిట్సు హైందవుల్
కొఱగారటంచు వా - గొనెడివారు
తే॥గీ॥ అక్కటా! స్వాభిమానంబు • నవలద్రోసి
ఆంగ్లభాషాభిమానులై • ఆంధ్రజనులు
కోడిగంబాడెదరు రిఫార్మర్సు - గూడికొనియు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ధర్మశాస్త్రార్థముల్ - దలక్రిందుగా మాఱె
గుణకర్మ రీతులు - గుహలందూఱె
ధనరత్నరాసులు - తెఱగి యావలఁ జేరె
దాంబిక వేషముల్ - దలఁపుమీఱె
పాణిగ్రహవివాహంపు - పద్ధతులే జాఱె
విధవల దుఃఖంబు - వెల్లిబాఱె
శమదమక్షాంతులు - సత్యశీలములాఱె
నార్యుల సిద్ధాంత - మటవిఁగోఱె

తే॥గీ॥ ఎన్నియో కష్టముల నీదు ♦ కన్నసుతులు
పొందుచున్నారు వానిని ♦ బోనడంచి
తొల్లి పజూపుము కరుణించి ♦ లోకవంద్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఓర్పు స్వాతంత్ర్యంబు - నూనుట సంభావ్య
మనఁగ ధారుణిసాక్ష్య - మునిచినావు
శీతోష్ణమంటక - చిన్మాత్రమైయుండు
డనిపవనంబును - నునిచినావు
అన్నిటిలోనుండి - యంటకుండెడు రీతి
మిన్ను సాక్ష్యముగాఁగ - బన్నినావు
మాలిన్యమంటక - మనుజులిట్లుండఁగ
నెంచివహ్నిని సృజి - యించినావు

తే॥గీ॥ ఇంతకృపఁ జూపుచుండుట ♦ నెంచలేక
తల్లిదండ్రియు గురువంచుఁ ♦ దలఁపలేక
మఱచితినినిన్ను నన్నునే ♦ మఱకుమయ్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ చర్చింతనాటక — శాల దేహముఁ జేసి
హృదయరంగస్థాన — మేర్పఱించి
వృత్తి బుద్ధులనాట - పెద్దనటులఁ జేసి
పరఁగు సంకల్పంబు — తెరలు జేసి
దివురు కూటస్థుని — దీపముగా జేసి
కామాదులను మేళ — గాండ్రజేసి
ఏచునింద్రియములఁ - జూచువారిగఁ జేసి
కథ దేవి మహిమము — గాఁగ జేసి

తే॥గీ॥ స్వప్నమంబాటఁ జూపుచు ♦ సక్రమముగ
సూత్రధారుఁడవై సాక్షి ♦ మాత్రుడుగను
నాటలాడింతు వాహెద ♦ వఖిలరూప
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ పగటికేయినిగుంచె — జట్టక చిత్రముల్
గ్రాలవ్రాసెడి చిత్ర — కారుఁడెవఁడు
బలురంగులఁ బరగు — పలుపుష్పతతులను
మహిసృజించిన తోట — మాలియెవఁడు
నిర్జనాటవులందు — నీటిపట్టులనుంచి
దాహబాధను దీర్చు — దాత యెవఁడు
అజగరంబు నోటి - కన్నమొసంగుచు
పాలించుచున్నట్టి - ప్రభు డెవండు

తే॥గీ॥ నాదుహృత్తంత్రులఁ మృదు ♦ నాదమొసఁగ
సొంపుమీరంగ మ్రోఁగించు ♦ సుభగుఁడెవఁడు
అట్టిప్రభు చిత్ప్రకాశంబు ♦ నాశ్రయింతు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఇహజన్మసుకృతంపు — భాగ్యవశంబున
జ్ఞానసందృష్టిని - జగతుకనిన
జిహ్వాసాగరమునఁ — బరగునీయఖిలమా
లోకముల్ బుగ్గల — వీఁకఁదోచు
నడవులు రోల్లునై — యన్నిఖండంబులు
నబ్జంబులై యొగి — నలరుచుండ
ప్రాణులబ్ధియందుఁ - బరఁగుజలచరముల్
శశిసూర్యులునునూడు — నమతిమణులు
తే॥గీ॥ చూచిచూచియుఁ జూడ్కులఁ — జూడమరచి
తన్నుమఱచియుఁ దోచిన ♦ వన్నిమఱచి
క్షీరమునసీరముంబలెఁ ♦ జేరునయ్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ అఖిలాండకోటి బ్ర — హ్మాండనాయకుఁడవౌ
నీస్వరూపంబెన్న - నేనుతగను
ఆకసంబుశిరమ్ము — యలసూర్యచంద్రులు
నేత్రద్వయంబుగా - నిలచియుండ
దిక్కులు బాహువుల్ - పొక్కిలిభూమియుఁ
బాతాళలోకమే — పాదయుగము
తరువులురోమముల్ .గిరులు — నెమ్ములుగాను
నిశ్వాసమనిలమై — నెగడుచుండ
తే॥గీ॥ నలరుఁజుక్కలుపుష్పమా ♦ రాశిగాఁగ
గుంతలంబులుమబ్బుల ♦ గుములుగాగఁ
వేదబృందము నీ ♦ వాక్య వితతిగాగ
బరఁగునీరూపుప్రాజ్ఞుఁడే ♦ యెఱుఁగునయ్య

సీ॥ క్రీస్తుమతంబెబలే — శ్రేష్ఠమం చనియేడి
క్రైస్తవసోదర - ఘనుడుగాని
ఇస్లాము సుమతంబె - యెక్కుడం చనియెడు
పరమహమ్మదు జాతి - నరుఁడుగాని
శాక్తేయమతమె న - శాస్త్రీయ మనియెడు
శక్తిపూజనుచేయు _ జనుడుగాని
పరగ శైవమతంబు - పరిశుద్ధమనిదెల్పు
తనరెడు వరలింగ - ధారిగాని
తే॥గీ॥ మాన్యుఁడైనను మఱియురా ◆ మానుజీయు
డైననద్వైతియైనను ◆ నాద్యమైన
శాంతిరసమును బొందగఁ ◆ జాలకున్న
నిన్నుఁగాంచుట సున్నయా ◆ పన్నరక్ష ॥చి॥
సీ॥ యమివిషయంబుల - సంటగాదని గదా
సూర్యరస్మినిసాక్షి - జూపినావు
సుఖదుఃఖముల రెంట - జూడనశ్వరమని
శుభ్రాంశు సాక్షిగఁ — జూపినావు
కవిహృదయము చాల — గంభీరమనిగదా
యుదధిని సాక్షిగ — నుంచినావు
పరానిలక్ష్యంబును - మానరాదనిగదా
సాక్షిగ గుటికానిఁ _ జాటినావు
తే॥గీ॥ నీదుసృష్టిని నీవస్తు ◆ నిచయములను
జనులు ధర్మంబులను నేర్చు ◆ కొనుటకవని
దేశికుల రీతిఁజేసితే ◆ దేవదేవ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ భక్తులపాలించు - భక్తవత్సలుఁడీవు
నగములలో మేరు - నగమవీవు
తారకాసమితిలోఁ _ దనరు చంద్రుఁడవీవు
అష్టవసువులలో - నగ్ని వీవు
వేదంబులందుండు - వేదార్థమవీవు
రాజులలో రామ - రాజువీవు
నీతులలో దండ - నీతివి నీవల
విద్యలలో మోక్ష — విద్యనీవు
తే॥గీ॥ జంగమా జంగమాత్మక ♦ జగతియందు
తమరు లేరను చోటొకిం ♦ తయును లేదు
లేదు లేదన్న వారికి ♦ లేవు లేవు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ సంసారమను గొప్ప — నంద్రిముఁ దాటెఁగ
దావకధ్యానము - తరణిగాదె
కర్కశాత్మక మగు — కాననమునుగాల్ప
నమలపవిత్యగూ్రప - మగ్నిగాదె
యజ్ఞానమను గొప్ప — యంధకారముఁబాప
విజ్ఞాన మేరవి — వ్రిభయుగాదె
తృష్ణామహాసర్ప - తీ్రవవిషయమువోవ
నణుమూపుడేతా ర్క్ష్య — మణియుఁగాదె
తే॥గీ॥ పాపజల దౌఘముల్ దోల ♦ భవ్యమైన
భవదుదార సమాఖ్యయే ♦ పవనమయ్యె
ఆర్తులకు నీవెదిక్కయ్యె ♦ యప్రమేయ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ కఠినాంతరంగుఁడు — గరుణాళుఁడై యొప్ప
యుష్మత్కృపాలవ - మొందెనేని
నిర్ధనుండైనను — నెగడు ధనంబుచే
యుష్మత్కృపాలవ — మొందెనేని
బలహీనుఁడును దివ్య — బాహుబ లాఢ్యుఁడౌ
యుష్మత్కృపాలవ — మొందెనేని
భిక్షుకుండైనను — బృథ్వీశ తిలకుఁడౌ
యుష్మత్కృపాలవ _ మొందెనేని

తే॥గీ॥ అహహా! నీదయమించిన ♦ యట్టి విభవ
మరియ నేలోకమున నెందు ♦ దొరకదయ్య
నీకు సామ్యంబునీవె పో ♦ నిర్మలాత్మ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ క్షమచేత నేగదా! — యమిత రాజ్యముమాని
పాండవుల్ విరటుని — పాలనుంట
క్షమచేత నేగదా! — సత్యహరిశ్చంద్రుఁడు
డలమాలనికి మేను — నమ్ముకొనుట
క్షమచేత నేగదా! సజ్జనుండగుశిబి
త్యాగానమాంసమ్ము — డేగకిడుట
క్షమచేత నేగదా! విమలాపగాసుతుం
డాజన్మబ్రహ్మచ — ర్యంబుగొనుట

తే॥గీ॥ క్షమకుసరిబోలు వేఱుసా — ఖ్యంబుగలదె
అమితమౌక్షమగలిగిన — యాత్మవిదుఁడు
నీదుభక్తాగ్రగణ్యుడై — నెగడునయ్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ నీప్రభ సూర్యుచే — నిఖిలజగంబుల
సూక్ష్మాణువుల నెల్లఁ — జూపినావు
నీశాంతమహిమంబు — నిండు చంద్రుని చేత
సకలలోకమ్ములఁ — జాటినావు
నీకృపారసమును — నాకసంబునునుండి
యమృతవర్షముగాఁగ — నరిచినావు
వఱలుగంభీరభా — వమును కనుదీటుగ
జలధులనందందు — నిలిపినావు

తే॥గీ॥ నీదుకల్యాణనిలయమౌ — నిఖిలభువన
జాలమగునందు జిత్రముల్ — చాలనుంట
వానిఁగనుఁగొనియానంద — వార్ధి దేలి
నన్నుతింతురు భక్తులు కన్నతండ్రి

సీ॥ నీ కాంతిసన్నిధి — నీరేజమిత్రుఁడు
పురుడింపమిడుఁగురు — పుర్వుగాఁదె
నీదగుకీర్తి సా — న్నిధ్యమందున శశి
తెల్లనౌ యద్దపు — బిళ్లగాఁదె
నీకరుణారస — నీరధి ముందఱఁ
బరికింప నబ్ధిత్వం — పరమెగాఁదె
నీ ప్రతాపాగ్నితో — నెఱపోల్చిచూడఁగ
వహ్నివిస్ఫులింగపు — చిహ్నమాత్ర

తే॥గీ॥ ఆదిమాధ్యాంత రహితుఁడై • నట్టి నీదు
దివ్యమంగళవిగ్రహ • తేజమెవఁడు
గాంచిదానిని వర్ణింపఁ • గలఁడు తండ్రి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ యుష్మత్ప్రతాపంబు - గ్రీష్మభానుడుచాటు
శాంతగుణంబునా - శశియెచాటు
నీదయారసమును - నిండువాఁకలుచాటు
గాంభీర్యమునుఁజాటు - గడలితేఁడు
నీచిద్విలాసమీ - నిఖిలసృష్టియెచాటు
నౌదార్యగుణమునా - యవనిచాటు
శాశ్వతమహానంబుఁ - సర్వంసహాయెచాటు
నిర్వికారగుణంబు - నింగిచాటు
తే॥గీ॥ నీదుమహిమనుజాటునా - నిగమగణము
నీదు నేర్పునుజాటునీ ♦ నిఖిలజగము
సర్వమునునీదుగుణముల ♦ జాటునయ్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ అఖిల బ్రహ్మాండమాల _ నాక్రమించిన నీకు
గుడిగట్టునంతటి - వెడఁగెవండు
"నామరూప క్రియల్" నహి - యనియుండ నీకె
విగ్రహంబుగ నెంచు - వెఱ్ఱియెవఁడు
గుణధర్మి ధర్మంబుఁ _ గూడకుండిన నిన్ను
గుణియంచుఁ బాగడెడి - కుమతియెవఁడు
నిగమంబులఁ జివర - నిలచియుండెడి నీకు
నుత్సవంబులఁజేయు - నోగెవండ
తే॥గీ॥ నీ మహాదివ్యతేజఁబు ♦ వెగడుచుండు.
నాఁడు నీభక్తుఁడగు పార్థు ♦ నకు నొసంగి
నట్టి జ్ఞానేక్షణంబును ♦ నలరనిచ్చి
వీరి దుర్బుద్ధిబాపుము ♦ పరమపురుష. ॥చి॥

సీ॥ క్షేత్రములెల్లయు — సేవింపఁ బోనేల
సాగరస్నానంబు — సలుపనేల
నెట్టన చైత్యముల్ — గట్టించు టదియేల
చాంద్రాయణంబును - సలుపనేల
కఠినోప వాసముల్ — గావించుటదియేల
యూరక ద్రవ్యము — నొసఁగనేల
కాషాయవస్త్రముల్ - గట్టి తిరుగఁగనేల
సంసారమును వీడి - చనఁగనేల
తే॥గీ॥ ఇంద్రియమ్ముల నిగ్రహించి § యెలమితోడ
జ్ఞానమయుఁడైన నినుఁగాంచి § శరణటంచు
సాక్షిమాత్రుఁడఁ గానుంట § చాలదేమి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ వెఱ్ఱివాఁడనిజనుల్ — వెక్కిరింతురుగాక
జడుఁడంచుదూషింపఁ — బడునుగాక
మతిహీనుఁడనితండ్రి - మాటలాడునుగాక
భార్యయుపేక్షచేఁ — బలుకుఁగాక
కుచ్ఛితుఁడనిబావ — కూఁకరించునుగాక
చెల్లెలధముఁడని — చెప్పుగాక
దుష్టాత్ముఁడనసఖుల్ — దొలఁగిపోదురుగాక
తమ్ముఁడుగర్విగఁ - దలఁచుగాక
తే॥గీ॥ అందఱన్నివిధంబుల § ననుచునుండ
నీదుభక్తుఁడువానిని § నమ్మినోర్చి
కరముయత్నించితుదనిను § గాంచునయ్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఫలమనిజ్వాలలఁ — బరికించిశలభంబు
వచ్చిదానంబడి - జచ్చుచుండు
గంటచప్పుడువిని - కాసరంబనిజింక
గుటికానివలలోనఁ -- గూలుచుండు
నామిషభ్రాంతిచే - నరుదెంచిమత్స్యము
గాలంబుమ్రింగియుఁ — గూలుచుండు
ఫలసత్యమనివేగ — భ్రాంతిచేనేనుఁగు
గర్తంబునన్బడి — యార్తినొందు

తే॥గీ॥ ఇంద్రియాధీనమునఁజచ్చు - నిట్లుజంతు
జాలమీరీతిమనుజుఁడు — చపలుడగుచు
సృక్కుపంచేంద్రియంబుల _సూరివంద్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ మానసమా నీదు — ధ్యానంబు చాలించి
కనులువిచ్చి జగంబుఁ ♦ గాంచుమిట్లు
పొట్టకూటికి రాలు _ గొట్టి పిధినిదుమ్ము
గ్రిమ్మమూసిన గుడ్డఁ — గట్టినతఁడు
ఎండవానలకోర్చి — కొండకట్టెలు దెచ్చి
గంజిచే నొకపూటఁ _ గడిపె నితఁడు
భూమిమన్ని ప్రజకు — భోజ్యవస్తువులిచ్చి
యలసి యంబలిఁగ్రోలు - నకటయితఁడు

తే॥గీ॥ ఇటులకష్టించుచుండఁగ ♦ సిలనుజనులు
ముక్తికైదోసిలొగ్గెదు - ముందువీరి
యిడుములడగింపదేవుని ♦ నడగికొనుము
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ దగచేతనాలుక - తడిఁబూర వేగమె
వారికై పరుగిడు - వానిఁబోలె
దావాగ్నిలోఁబడి - దరిగనుంగొనలేక
నలువైపులను బాఱు - నరునిబోలె
బలుభీతి నెదగొల్పు - పలినోటఁబడగఁదా
మిత్రునిఁగొఱ కేడ్చు - మృగయుబోలె
త్రొక్కుచు బాముగఱువ - దలకెక్కువిష మెల్ల
మాంత్రికుఁ డెందను - మనుజుఁబోలె

తే॥గీ॥ ఆస్తికుఁడునిన్నుఁగన నెంచి ♦ యుగ్గలంపు
జనముతో జన్మకర్మక ♦ జ్ఞవులఁజెంచి
నీదు చెంతను తాఁజేరు ♦ నోద నూళు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఇందిరయోనాన్మదంబు - నెడఁజేసి నినుగాంచి
పరగెడి దినమది - పర్వదినము
మూసి తొమ్మిది రంధ్ర - ములనంత నినుఁగాంచి
రాజిల్లుదినమది - రామనవమి
పంచకోశంబులఁ - బరిమార్చి చిత్ప్రభఁ
గాంచిన దినమో యు - గాదిదినము
విషయాదులను వీడి - వెనమనంబును నిల్పు
దినమె ఏకాదశి - యను దినంబు

తే॥గీ॥ నిట్టిదట్టిదియనిబుద్ధి ♦ నెఱుఁగరాని
మోక్షపదమందుదినమది ♦ ముఖ్యదినము
మిగులుదినములుదుర్దిన ♦ మగునువండి
చిత్సుఖానంద సర్వేశ. చిద్విలాస.

సీ॥ కఠినచిత్తుఁడగాన — కరుణించి వరదయా
వృష్టిని గురిపింపు — వేదవేద్య
మనమున జీకటి — ననిశంబునుం బాపి
స్వచ్ఛకాంతిని నిమ్ము - సౌమ్యమూర్తి
పాపుదైన్యముచేతఁ బరుగిడు చిత్తంబు
బట్టి శిక్షింపుము - ప్రాణనాథ!
జీవితకళ దప్పి — చీకాకు పడియెడు
నమృతసిద్ధినొసంగు - మపరిమేయ
తే॥గీ॥ వికృత సంసారభీకర ♦ విపినమందుఁ
జిక్కి వెతఁగొందినట్టి ♦ నాచెంతఁ జేరి
తావకాభయ జ్ఞాన సం ♦ ధాన మిమ్ము
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ ఘోరసంసృత్యకూ — పారముఁ దరియింపఁ
బలమొసంగుము భూరి - బలనమువరి
తుచ్ఛవిషయములఁ - దొలఁగియుంటకుగాను
సన్మార్గమును జూపు - సచ్చరిత్ర
సుఖదుఃఖములు సోక — నుడిఁ బడకుంటకు
శాంతి నొసంగుము — శాంతరూప
బీదసాదలకుండు — పెన్బాధలం ద్రోలు
మతినొసంగు మనంత! - క్షితిజలేశ
తే॥గీ॥ శమము దమమును ధైర్యంబు ♦ సత్యవాకు
నాకొసంగుము ప్రాచీన ♦ నాథనాథ
నీవె నాకెడుగడవయ్య ♦ నిర్మలాత్మ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ప్రకృతిశాస్త్రముచేతఁ – బ్రాపించి బోసును
వల్మీకభవు కవి – వర్యుఁజేసి
అభిమన్యునకు శౌర్య – మధికంబుగా నిచ్చి
రామకృష్ణునిమది – రహిం జెలంగి
సాందీపునకు జ్ఞాన – సామ్రాజ్యము నొసంగి
పాతంజలికి యోగ – పథము జూపి
త్యాగరాజును గాన – ధౌరేయునిఁగ నుంచి
ప్రహ్లాదునకుఁ జాల – భక్తి దేల్చి

తే॥గీ॥ అయ్యో! ననువ్యర్థునిగఁ జేసి ఽ యాకసమున
దిరుగు శరదభ్రశకలపుఁ ఽ గరణినుంచి
యున్నవాఁడవు కరుణింపు ఽ మోహమహాత్మ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ రాచకార్యపువ్యక్తి – రాజ్యభారపుశక్తి
బాలగంగాధర – తిలకు కిచ్చి
అసమ వాక్పటిమంబు – నమలధీ మహిమంబు
శ్రీ వివేకానంద – సిద్ధునకిడి
పర హితాచరణంబు – వర మహాకరుణయుఁ
బరఁగఁబుద్ధునిమది – గురియఁజేసి
సంస్కరణపుభక్తి – సాధనాంతర యుక్తి
వీరేశలింగార్య – విభునకొసఁగి

తే॥గీ॥ శ్రీశ! నాకోర్కె గ్రీష్మన ఽ రిజ్జలంబు
వలెను నింకఁగఁ జేసితి ఽ వరుసయేల
నన్నువిడనాడ ధర్మమా ఽ కన్నతండ్రి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ భారతజాతికి - భావదాస్యముమాన్ప
నేమహాత్ముఁడు జన్మ - మిలనుబొందెఁ
హిందూ మహమ్మదీ - వైషమ్యములు పోఁగొట్ట
నే మహాత్ముడు జన్మ - మిలనుబొందెఁ
పాపపిశాచంబు - పాఱఁదోలుటకునై
ఏమహాత్ముఁడు జన్మ - మిలనుబొందెఁ
పరగ నహింసాఖ్య - పద్ధతులను దెల్ప
నేమహాత్ముఁడు జన్మ - మిలనుబొందెఁ

తే॥గీ॥ నిట్టిగాంధి మహర్షి య ♦ హీనకీర్తి
ప్రవిమలాధ్యాత్మఖ నిసత్య ♦ పాలకుండు
నీదుభక్తులలో మేటి ♦ నిర్వికార
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఎత్తితిజన్మము - లెన్నియో లక్షలు
చూచితిఁ బలుమాఱు - సురపురంబు
గర్భదరిద్రుఁడై - గడు ధనవంతుఁడై
మాంత్రికునై పక్షినై - మాలనైతి
చిలుకనై చిలువనై - తలఁప నెనుబదినాల్గు
లక్ష జాతులలోన - లలిజనించి
అమిత కష్టసుఖము - లనుభవించియునూరి
జనులకుఁ బూజలు - నలిపినాఁడ

తే॥గీ॥ చాలునాజన్మమింతట ♦ జాలునయ్య
ఏలయిటు జేసెదవునన్ను ♦ నేలుమయ్య
ఏలకుండిన నిన్విడఁ ♦ జాలనయ్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ వెనుక నేనెత్తిన — వేలు లక్షలకోట్లు
జన్మముల్ చెప్పంగఁ — జాలు నెవఁడు
మునుపు నేఁ గుడిచిన — చనుబాలు లెక్కింప
వలసముద్రములెన్ని — యగునో దలఁప
వసుధ రేణువులెల్లఁ — బ్రిస్తరింపఁగ వచ్చు
తల్లి దండ్రుల సంఖ్య — తలఁపనగునె
మాఱె నీజగమును — మాఱిరి రాజులు
నాదుజన్మము మాఱఁ — లేదు తండ్రి
తే॥గీ॥ ఏలకృపలేదె పెఱవానిఁ ♦ బోలెఁదలఁప
నీకు నిదిపాడియౌనె ♦ విమలాత్మ
వేగనీకృప జూపుము ♦ వేదవేద్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ ఎన్ని యుగంబులో — నన్ను దూరముఁ జేసి
విడనాడ నీవు నే — విడవనయ్య
ఏటికి నెదురేగు — దీటుగ దుఃఖంబు
బోనాడివచ్చితి — బ్రోవవయ్య
హృదయ నీరేజంబు — నెండుచున్నది కానఁ
గరుణారసము చిల్క — గావవయ్య
మృత్యుసర్పము మిన్న — మ్రింగుచున్నది నన్ను
నీలోనఁ జేర్చియు — నేలుమయ్య
తే॥గీ॥ అంధకారపు గర్తంబు ♦ నందుఁజిక్కి
కాయమునుడస్సె దివ్యమౌ ♦ కాంతి నొసఁగి
నన్ను రక్షింపవయ్య యా ♦ పన్నరక్ష
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ సురభినాటక సభా – గురుఁడనై దేశంబు
దిరుగుట నీయాజ్ఞ ♦ తెలుఁగు గాదె
హరికథలను జేసి – ధరణిప సభలందు
జెప్పుట నీయాజ్ఞ – చేతఁగాదె
భైషజవృత్తిచే – వసుధ బీదలసేవఁ
జేయుట నీయాజ్ఞ – చేతఁగాదె
అఖిలతత్వంబుల – నరయ గురులసేవ
జేయుట నీయాజ్ఞ – చేతఁగాదె

తే॥గీ॥ అట్టి నీయాజ్ఞ నీజన్మ ♦ మందుఁగాక
పూర్వభవమున నెంతయో ♦ నిర్వహించి
వచ్చితిని జెంతఁజేర్పు కృ ♦ పామయాత్మ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ సృష్టిసౌభాగ్యంపు – శ్రేష్టత్వమును జూడ
బంచితివిపుడు న – న్పరమ కృపను
గాంచితి నీసృష్టి – కౌశలంబును దానిఁ
జూడ నాకెంతయుఁ – జోద్యమయ్యె
నీవుబంపిన పని – నెఱ్ఱవైతె నన్నిక
నీదరి జేర్చుము – నిర్మలాత్మ
సంతకూటపుఁ బను _ లెంతయు జేసితి
తీఱె నాపని నీకుఁ – దెలుపుకొనఁగ

తే॥గీ॥ నాజ్ఞయిచ్చిన వచ్చెద ♦ నయ్య నీదు
దివ్యదర్శన సంప్రాప్తి ♦ దిసముకొఱకు
వేచియున్నాఁడ కబురంపు ♦ వేగదండ్రి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ దినదినంబును మోహ - మను పాశములఁ ద్రెంపి
నీసమక్షమునను - నిలుపవయ్యా
నిచటి కార్యములెల్ల - నెలమిమైఁ జేసితి
నీసన్నిధిని నన్ను - నిలుపవయ్యా
జనసంఘమును బాసి - మునిగైన వేళలో
నీయెదుటను నన్ను - నిలుపవయ్యా
అంత్యకాలపు దుఃఖ - మనుభవింపకముందు
నీ ముంగిలను నన్ను - నిలుపవయ్యా

తే॥గీ॥ ఎట్టిసమయంబునందు నిం ♦ కెట్టిదేశ
మైన నిలచిన గూర్చున్న ♦ ననఘచరిత
త్వన్మహా దివ్యతేజంపు ♦ దరిని జేర్పు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ వెలిపనులను వీడి - వేవేగ నీ చెంతఁ
జేరవత్తునుగాని - యూరకుండ
బనిలేనియప్పుడు - నినుఁ గాంచుటకు దారి
గోరుచుందునుగాని - యూరకుండ
బ్రతినిమిషంబు నీ - పనిబూని నినుఁ జూచు
చుందునుగాని నే - నూరకుండ
పాన్పుపై బడి నిన్నుఁ - బలవరించుచు నెప్పు
డుందునుగాని నే - నూరకుండ

తే॥గీ॥ నామయాత్రిసెఁ కుందెడు ♦ నట్టివేళ
గానియెప్పుడు నిన్నుఁ గొల్వ ♦ కేను భోజ
నంబునైనను జేయను ♦ నాదుబంధ
నంబులను ద్రెంచుమెప్పుడు ♦ నాథనాథ

సీ॥ వరుసనిత్యా నిత్య — వస్తువివేక మి
హాముత్రభోగ ని — ష్కామితయును
మహితమైనట్టి శ — మాదిషట్కంబును
క్షయ మొందని ముము — క్షుకత యనఁగ
నీసాధనంబుల — నెప్పుడు దప్పక
యాచరించుచునుండు — నతఁడు వేగ
గురుసన్నిధికి భక్తి — సరిగి యాత్మానాత్మ
మును విచారించెడు — ఘనుడుగాని

తే॥గీ॥ తావకధ్యాన నిర్మల ♦ తత్త్వదృష్టి
బడసి నినుగాంచి ధన్యతఁ ♦ బడయునయ్య
చపలుఁడెరుగునె నెన్నఁడు ♦ జగదధీశ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ షట్కరీతులఁ — జర్చించి తనలోన
పంచముద్రల భావ — మెంచిదెలసి
తారకసిద్ధుఁడై — తలఁపు శుద్ధముచేసి
సాంఖ్యశాస్త్రార్థంబు — చక్కనెఱిఁగి
వరపతంజలి సూత్ర — పద్ధతులను నేర్చి
దండకాన్వయ రీతిఁ — దగ నెఱింగి
యజపగాయత్రీ ర — హస్యంబు తెలిసియు
లంబికాయోగ సం — లక్ష్యమెఱిఁగి

తే॥గీ॥ చేసిచేయని చేయక ♦ చేయుచున్న
దివ్య సమదర్శిసిద్ధుఁడై ♦ తేజరిల్లి
జ్ఞాని నీసత్యరూపులోఁ ♦ గలయునయ్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ మానసంబునిలచె — మార్గమబ్బ నటన్న
నంతలోఁ జలియించి — యరుగునెందొ
మరలఁ దెచ్చిలయించు — మార్గముఁ జూపిన
మోసంబుచే నన్నుఁ — బాసివెడలు
కుంభకంబునఁగట్టి — కూల్చివైచిన నంత
దెగఁదీసి వచ్చెడుఁ — దెంపుచేత
దివ్యతేజముఁ జూపి — తెరవు బంధించిన
పరవశమై లేచి — పాఱిపోవు

తే॥గీ॥ గానవిడుపును పట్టును ♦ లేనిదివ్య
రాజయోగంబుచే సిద్ధ ♦ రాజిలంగ
నభ్యసింపక నినుఁగాంచ ♦ నగునె తండ్రి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఒనర దేహంబును — నొకరథంబుగఁజేసి
కరణంబులను దురం — గములఁజేసి
మించుచిత్తంబును — మేలుకళ్లెముఁజేసి
బుద్ధినిఁ సారథిఁ — బోలజేసి
ఈయహంకారంబు — నిరుసునుగాఁజేసి
నిశ్వాసములు చక్రి — విధిగఁజేసి
చటులసుషుమ్నను — చబుకునుగాఁజేసి
రధికుఁడై లోపల — రాణనుండి

తే॥గీ॥ రాజయోగంపునడివీధి ♦ రథమువిడచి
ధూర్తమైనట్టి సంసార ♦ గర్తమందు
బడకనినుఁగాంచు యోగియు ♦ పరమపురుష
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ చర్చింప జననాది - షడ్వికారములచే
సుడివడు దేహంబు – స్థూలమందు
పదియు నేడిందియ - ప్రాపకమైలింగ
దేహంబు సూక్ష్మమా – దేహమందు
అజ్ఞాన మీరెంటి – కాధారమైయాత్మ
నైక్యమందిన కార - ణాఖ్యఁదనరు
మూడవస్థలచేత – ముడివడుచుండు నీ
మూఁడు దేహంబుల – జాడ నెఱిఁగి

తే॥గీ॥ ఏదివెలిఁగొందు శుద్ధమై ♦ ఏకరీతి
సత్చిదానందుఁడై సని ♦ న్నసిశమీశ
దెలియుటే మోక్షమందురో ♦ దేవదేవ ॥చి॥

సీ॥ ఉర్విశోణిత శుక్ల – యుక్త్యుద్భవంబయి
యన్నకోశ మగునా – హారమునను
పంచప్రాణులుకర్మ - పంచేంద్రియంబుల
కూడికయును ప్రాణ - కోశమంద్రు
జ్ఞానేంద్రియము లైదు – ఘనమనంబొక్కటి
కూడి మనోమయ – కోశమందు
ఎంచబుద్ధియుజ్ఞాన – పంచేంద్రియించి వి
జ్ఞానకోశంబని – జ్ఞానులందు
అరయ సంతఃకర – ణానంద మోదప్రి
యాజ్ఞాన కోశము – లనఁగనైదు

తే॥గీ॥ కోశములనెల్ల కాలము ♦ గోరియరసి
యొగియవస్థలఁ జూచుచు ♦ నొక్కరీతి
సాక్షిగానుంట ప్రత్యక్ష ♦ మోక్షమందు ॥చి॥

సీ॥ అన్నిటిలో బ్రహ్మ — మరసియింద్రియమదం
బపనయించుటయమం — బనఁగఁబరగు
తనకన్యమైతోఁచు — దానిస్పృశింపక
నెగడుటయేయిల — నియమ మండ్రు
విశ్వంబు చిత్తంచు — వెస నెఱింగి యుపేక్ష
వహియించు టే త్యాగ — మహిమయండ్రు
మనసు వాక్కులకునుఁ — గనరాని యోగంబు
మౌనవిధి విధాన — మార్గ మండ్రు

తే॥గీ॥ ఇట్టి కడుసూక్ష్మ యోగఁబు ♦ లెట్టి గురుని
దయ నెఱింగి భవాంబుధి ♦ దాటి తాను
నిత్యసుఖమందు సుజ్ఞాని ♦ నిహము నందు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ స్వాంతమన్యపదార్థ — సమితి బహ్మంబని
యెఱుఁగ బ్రాణాయామ — సరణియండ్రు
విషయమాత్మఁగఁ జూచి — వెసమనంబును బుద్ధి
నెనయఁ బ్రత్యాహార — మనఁగఁ బరగు
నెందేమిఁ జూచిన — నందు బ్రహ్మంబుగాం
చుట ధారణయను పే — రిటఁ జలంగు
నేను బహ్మంబని — యెఱిఁగి సద్వృత్తిని
మొనసియుండుట ధ్యాన — మనఁగఁబరఁగు

తే॥గీ॥ నిట్టి గుహ్యార్థసూక్ష్మంబు ♦ లెఱుఁగు యోగి
వీసి నన్నియవస్థల ♦ వేగ నడిపి
కర్మ చేసియు చేయడు ♦ నిర్మలాత్మ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఆద్యంతములు లేని - యట్టి నిండినవస్తు
వరయవిజనమని - యనుచు నుండ్రు
ఎంచుకృత్స్నులై - యుందురో విబుధులు
నదిప్రసిద్ధాసనం - బనఁగబరఁగు
ఏస్థలంబునఁ జిత్త - మేకరీతిగనుండు
నదియోగదామూల - మనఁగఁ బరగు
ఏదృష్టిచే జగం - బెల్ల బ్రహ్మముదోఁచు
నది రాజయోగంబ - టండ్రు బుధులు

తే॥గీ॥ ఇట్టిమృదువైన యోగంపుఁ ♦ జెట్టఁబట్టి
నీటమునిఁగిన భాండంపు ♦ సాటిగాను
యోగి చరియించుచుండును ♦ యోగివంద్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ పడవలోఁ గూర్చుండి — పయనంబుఁజేసిన
బయటి వెల్లనడచు — పగిదిదోఁచు
శారదచంద్రికా — సమతిగాంచినపైత్య
గదునకుబంగరు — కరణిదోఁచు
కొఱవిగిట్టునఁద్రిప్ప - కొలఁదినివట్రువై
సూర్యమండలగతి — సొబగుతోఁచు
కంటికద్దములిడ — కాంచిన సూక్ష్మవ
స్తువులెల్లగొప్పగఁ — దోఁచుచుండు

తే॥గీ॥ నటులె యజ్ఞానవశమున ♦ నాత్మ మఱచి
తనువటంచును మూఢుండు ♦ దలఁచు దాను
ప్రత్యగుండనిగనలేక ♦ సత్యరూప
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ హాయిగ గంధవా - హమ్ము వీచెడివేళ
ప్రజపరవశమగు - పగదిగాను
క్రొక్కారుమబ్బులు — మ్రోగుచుండిన కేకి
పురివిచ్చి యాడెడి — కరణిగాను
లేమావి చిగురుల - లెక్కమీఱంగ మెక్కి
పాడెడి కోకిల - వడువుగాను
వేణుగానరవంబు — వీనుల సోఁకిన
బరవశంబగు గోవు — సరణిగాను

తే॥గీ॥ అమలసుజ్ఞాని నినుఁగాంచి ♦ యనవరతము
నిశ్చలానంద సంపూర్ణ ♦ నీరరాశి
దేలిజగమును మఱచునో ♦ దివ్యరూప
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ సొంపుగ మది పరి — శుద్ధిగాంచితినయ్య
యెప్పుడిందున వసి — యింప నీవు
తలఁపున నన్నృతముల్ — తొలఁగఁ ద్రోసితినయ్య
యెప్పుడిందునె వసి — యింప నీవు
దుర్గర్వమును మదిఁ — ద్రుంచివేసితినయ్య
యెప్పుడిందునె వసి - యింప నీవు
విషయవల్లుల నెల్ల - విరచివైచితినయ్య
యెప్పుడిందునె వసి — యింప నీవు

తే॥గీ॥ బుద్ధిదీపంబు వెలిఁగించి ♦ మొనసినాను
చిత్తమను పాన్పునీకును ♦ సిద్ధమయ్యె
విశ్రమింపుము నాతండ్రి ♦ విశ్రమింపు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ అజ్ఞానతిమిరంబు - నణచిఁ నేనీకునా
మతిగేహమందుస్వా - గతమొసంగి
పరివిమలధ్యానార్ఘ్య - పాద్యములనిచ్చి
యాయాసనమంతయు - నుపసయించి
వైరాగ్యదీపంబు - వర్ధిలవెల్గించి
భక్తియుశ్రద్ధయుఁ - బ్రబలఁజేసి
పూనియహింసాది - పుష్పములనుజేర్చి
పూన్కిమీఱుచునుండఁ - బూజసల్పి
తే॥గీ॥ పూనియుపనిషదర్థతాం ♦ బూలఁమొసఁగి
నంజలిని జేసిజ్ఞానాక్షి ♦ నంత తెఱచి
ప్రణుతులనొనర్తునైక్యనం ♦ ప్రాప్తికొఱకు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ ఈనగంబొక దిన - మెంచఁగ బ్రళయాన
కంధిఁబడుసువలెఁ - గఱఁగిపోవు
ఈభానుఁడొక దిన - మెంచ తేజంబింకి
చక్రంబువలెఁ గ్రింద - జాఱిపడును
ఈవహ్నినొక దిన - మెంచఁ వేడిమివీఁడి
చప్పన జ్వాలలు - చల్లఁబడును
ఈగాలియొక దిన - మెంచఁ గతిసిపీడి
యాకాశసలయు మం - దైక్యమగును
తే॥గీ॥ కానిజ్ఞానాగ్ని చే మేనిఁ ♦ గాల్చివైచి
నిన్నుఁగలసిన యాభక్తుఁ ♦ డెన్నియుగము
లైన నిలకడగానుండు ♦ ధ్యానగమ్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ఎట్టికాలంబైన - నేవేళలందైన
యింటనైననువీధి - వెంటనైన
గ్రామాంతరంబైన - ఘనవిపినంబైన
నీటనైననుమాల - వీటనైన
ఆటపాటలనైన - అధికవ్యాధులనైన
మాటలాడుచునైన - మౌనమైన
నిర్వికల్పసమాధి - నిష్ఠలయందైన
సవికల్పకసమాధి - సమయమైన

తే॥గీ॥ అమలసుజ్ఞానిస్థూల - దేహంబువిడిచి
భావనాతీతకైవల్య ♦ పదవిజేరి
నీటిలోనుప్పుకరఁగిన ♦ దీటుగాను
చెదరకుండునునేవేళ ♦ జగదధిష్ఠ

సీ॥ ఏవికారములేక - యెంతోఁ దానంటక
దాఁజేయు పనులందుఁ - దగులుకొనక
"తైలధారను" బోలి - దఱుగక యొకరీతి
"నసి" పదంబునఁజేరి - యాత్మవిదుఁడు
నిలచినఁ గూర్చున్న - నలఁగ బల్కుచునున్న
పనులనుజేసినఁ - బండియున్న
నేసాధనములేక - యేమియుఁ దలఁపక
శుద్ధుఁడై సంపూర్ణ - సిద్ధుఁడగుచు

తే॥గీ॥ నమలసుజ్ఞాని తానెట్టు ♦ లమరియుండి
యూహలకు మాటలకునంది ♦ యుండనట్టి
యమృతపదమంది సుఖియించు ♦ నఖిలరూప
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ అంద మైమిగులనా - సందకరంబునై
వంద్యమై మోక్షసం _ బంధమగుచు
దివ్యమైజ్ఞానసం — భావ్యమైమునిజన
సేవ్యమై సజ్జన - స్తవ్యమగుచు
సారమైబుధజనా — ధారమై చిరచిదా
కారమైసంసార - దూరమగుచు
నిత్యమైబ్రహ్మాండ — కృత్యమై యోగీంద్ర
నృత్యమైయాధార — సత్యమగుచు
తే॥గీ॥ పలుకులకునూహలకుఁగాని ॥ తెలియబడక
నిష్కలంకవిధంబునై ॥ నిర్వికార
మైనసిరూపుఁజూపు మో ॥ "యప్రమేయ"
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ షడ్రసంబులరుచిఁ - జవిజూచునాల్కకు
సరయు తైలంబించు — కంటనట్లు
నీటఁబద్మదళంబు - నిలిచియుండియుదాని
తడియించుకేనియు-దగలనట్లు
బురదలోఁగుమ్మర —పురుగుపాటాడుచు
పంకిలంబును మీన — బడయనట్లు
కలుగుండలోనినా - కసమునిండియుదాని
కావంత మైలయు — నంటనట్లు
తే॥గీ॥ అమలసుజ్ఞానిసంసార ॥ మందెయుండి
కర్మములఁజేసిచేయని ॥ కరణినుండి
యెందునంటకనీధ్యాన ॥ మందెనిలచు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ స్వర్ణకారకవస్త్ర — సర్వశిల్పజ్ఞులే
దేశమువృద్ధికిఁ — దెచ్చువారు
కనుల నెల్లెడలను - గనిపెట్టువారలే
దేశమువృద్ధికిఁ - దెచ్చువారు
వైదిక నైతిక — పరీక్షా ధురీణులే
దేశమువృద్ధికిఁ — దెచ్చువారు
వ్యాపార నౌకకా — వ్యాదిసన్నేతలే
దేశమువృద్ధికిఁ - దెచ్చువారు

తే॥గీ॥ ఇట్టివారలఁ గోట్లకుఁ ♦ బుట్టఁజేసి
వారిచే దేశమభివృద్ధిఁ ♦ బడయఁజేసి
నిత్యసౌఖ్యంబు జనులకు ♦ నిమ్ము దేవ
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ పొదుగునిండుగ పాలు - పొదలుచునుండియు
పిడుదు గ్రోలు నెదూడ - వడువుగాను
పూలసన్నిధి పేఁడ - పుర్వుండినను దాని
మధువు ద్రావునె తేఁటి — విధముగాను
నారికేళఫలమ్ము — నాశ్రయించిన క్రోతి
దిను నెలోజిగుగును — మనుజరీతి
శరదిందుచంద్రికా - పరచితిమాంధుఁడు
నెఱుఁగునే మంచిక — న్నెఱిఁగినట్లు

తే॥గీ॥ శుద్ధచిన్మాత్రమా నిన్ను ♦ శుభదమైన
సురచిరానందనమనస్క ♦ పరచితుండు
నెఱుగునే గాని! యితరులు ♦ నెఱుఁగుటెట్లు
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ ప్రాచీన విజ్ఞాన — పద్ధతులను నేర్చి
శిల్పశాస్త్రజ్ఞులు — చెలఁగుచుండ
సకల సస్యాఢ్యమై — సంపదాకరమునై
భారతమాతయుఁ — బరఁగుచుండ
ప్రజలు రాజులు భేద — భావంబులను వీడి
యన్యోన్య మైత్రిచే — నలరుచుండ
క్షామాది బాధలఁ — గలఁగకుండఁగ జనుల్
నిత్యసంతుష్టులై — నెగడుచుండ
తే॥గీ॥ ధైర్యమును కార్యసాధనత ♦ ధర్మదృష్టి
గలిగి సత్యంబు విడక ♦ కలితభక్తి
నిన్నుఁ బూజించుభాగ్యము ♦ నిమ్ముతండ్రి
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.
సీ॥ తేనెసోనల జల్కు — తియ్యని కావ్యంబు
విరచింప తిక్కన — ప్రకటఁగాను
పూలచెండ్లగ జల్లు — లీలపద్యంబుల
విరచింప పోతన — రాజుగాను
ముద్దుపల్కులగను — ల్లాసమెత్తిన రీతి
పసనంగ ముక్కుతి — మ్మన్నగాను
స్వాదుద్రాక్షారసా — స్వాదనమైనట్లు
నుడువంగ పెద్దనా — ర్యుడనుగాను
తే॥గీ॥ అమృతరస గుళికలవలె ♦ నలర జెప్ప
ఆంధ్రవాల్మీకి సుబ్బరా ♦ యుండగాను
శక్తిహీనుఁడఁ గైకొమ్ము ♦ శస్తరూప
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సీ॥ నిగమంబులేనిన్నుఁ — బొగడఁజాలకయున్న
నేనెట్లుకొనియాడ - నేర్తునయ్య
జిల్లుమాటలుకొన్ని — జతగూర్చి చేసిన
శతకంబుగొనుము - ప్రశస్తరూప
పద్యపుష్పాంజలి -- భక్తిమైసర్పింతు
పరిశుద్ధమతిఁగొమ్ము — భవ్యచరిత
దయయుంచిభక్తబృం — దములోనకడపటి
వానిగాననుఁజూడు — దీననాథ

తే॥గీ॥ తలపవసుధర్మవరసుబ్బ ♦ దాసటండ్రు
చేతనైనంతమాత్రము ♦ జెప్పియున్న
నీసశతకంబువర్ధిల్ల ♦ జేయుమయ్య
చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస.

సమాప్తి.

## — నాచే రచింపబడిన గ్రంథములు —



| | | |
|---|---|---|
| 1. | అభిజ్ఞాన జయదేవ నాటకము | రు. 1—0—0. |
| 2. | చిద్విలాస శతకము | 0–1½–0. |
| 3. | పశుయజ్ఞ ఖండన | 0—8—0. |
| 4. | మానస గీతావళి | 0—6—0. |
| 5. | ఆత్మారామ గేయములు (స్త్రీలకు) | 0—6—0 |
| 6. | పరమేశ్వర శతకము (స్త్రీలకు) | 0—2—0. |
| 7. | విష్ణునామావళి | 0—1—0 |

గ్రంథము లన్నియు నొకేతూరి కొనువారికి 2—12—లకే పంపబడును. వి. పి. ఖర్చులు కొనువారివే. ముందుగా సగము పైకము పంపవలెను.

——